**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

Bibliographic Record Target

శ్రీరామచరిత్రము : సవ్యాఖ్యానము / ఇది గా. హరిసర్వోత్తమరావుచే ప్రకటితము.- 3. కూర్పు.- చెన్నపురి : వేదం అండు కంపెనీ ముద్రాక్షరశాల, 1927.

(2), v, 12-120 p. ;18 cm.

Record no. 689

Śrīrāmacaritramu : Savyākhyānamu / idi Gā. Harisarvōttamarāvucē prakaṭitamu.- 3. kūrpu.- Cennapuri : Vēdaṃ aṃḍu Kampenī Mudrākṣaraśāla, 1927.

(2), v, 12-120 p. ;18 cm.

Record no. 689

35 mm microfilm

Image placement: IA (IIA) IB IIB       Date filming began:

పోతనామాత్యకృత

భాగవతాంతర్గత

307

# శ్రీరామచరిత్రము

సవ్యాఖ్యానము

గా. హరిసర్వోత్తమరావు ఎం.ఏ.

భాగవతములోని

# శ్రీరామచరిత్రము

(సవ్యాఖ్యానము)

ఇది

గా. హరిసర్వోత్తమరావు ఎం. ఏ. చే

ప్రకటితము

మూడవకూర్పు

చెన్నపురి:

వేదం అండు కంపెనీ ముద్రాక్షర శాలయందు

ముద్రితము.

౧౯౧౭





# అంకితము

“చిన్నతనమునందె శిశువున్న వీడుచు
భువిని విడచి చనియె పుణ్యచరిత
తల్లి నామెం దలంతుం దలంచి యుల్లమునందు
నాకె గారవింప నాసంగొందు.”

“అయిన నాదుశక్తి యది సున్నయే యని
వగచుచుందు దైవ వశముచేత
రామచరితవ్యాఖ్య వ్రాయుట యిది గల్గె
ధన్యుడంగుదు దీనిం దల్లి కిచ్చి”

“భాగవతము చూడ భవ్యకావ్యము పోత
రాజు వ్రాత మిగుల రమ్యమందు
దాన రామచరిత తథ్య ముత్తమ మమ్మ
కానదీనివ్యాఖ్యం గరుణం గొనుము”

“తల్లి భాగీరథీబాయి ధర్మమూర్తి
‘పోతరాజేడ నీవేడ బుద్ధిహీన’
యనుచుం గినుకను నన్ను నీ వాడెదొకొ
అవునునిజమౌను నీమాట యగునుగాని
యుడుతభక్తిని రామున కుపచరించెం
గాదె యారీతి నేనును గడంగినాడం
గాన లోపంబు లెంచక కరుణం జూచి
కోరి కీడేర్పు నీముద్దు కొమరు నాదు.”



మూడవకూర్పునకుం బీఠిక.

పోతనామాత్యుని జన్మభూమిని గురించిన చర్చ యింకను జరుగుచునే యున్నది. వరంగల్లు పక్షవాదులు ఆప్రాంతములలో పోతన సంతతి వారలున్నారనియు మరియితర సందర్భములును పోతన జన్మభూమి వరంగల్లు అనియే సూచించుచున్నవనియు వ్రాయుచున్నారు. ఇటీవల మ. రా. జయంతి రామయ్య పంతులుగారు పోతనసంతతివారివద్దివి యని కొన్ని దానపత్రముల ప్రకటించి పోతన వరంగల్లు నివాసియేయని స్థాపింప జూచినారు. అక్కాలమున కవులు ఒక ప్రాంతమునుండి మరి యొకప్రాంతమునకు సులభముగా నివాసము మార్చుచుండినారు. అందులోను దేశస్వభావమునుబట్టి దత్తమండల ప్రాంతములకును ప్రస్తుతపు నైజాము ప్రాంతములకును నెక్కువ సఖ్యముండినట్లు నిదర్శనములు గలవు. కాబట్టి యింకను నెక్కువ సాక్ష్యము సమకూరువరకు ఇదమిద్ధమని సిద్ధాంతముచేయరాదు. అట్టి సిద్ధాంతముచేయు ప్రయత్నము సాధ్యమగునేని రాబోవు కూర్పున చేయతగియున్నది. చదువరులు మన్నింతురుగాత.

ఆంధ్రలోకము నా కొసంగిన ప్రోత్సాహమునకు వారికి వందనము లర్పించుచు ఈ మూడవకూర్పును వెలువరచుచున్నాడ.

౩, క్రొత్తబంగళావీధి,
చింతాద్రిపేట,
౨౮-౩-౧౭.

ఇట్లు
బుధజనవిధేయుండు
గా. హరిసర్వోత్తమరావు.

## రెండవకూర్పునకుఁ బీఠిక.

మొదటికూర్పునఁ గొన్ని ప్రతులు మాత్రమె ముద్రింపించితిని. ఆప్రతులనన్నిటిని నాంధ్రలోక మచిరకాలముననే స్వీకరించి ఈ రెండవ ముద్రణమున కావశ్యకము గలుగఁజేసిరి. అందులకు వారికెంతయుఁ గృతజ్ఞుఁడ. ఈకూర్పును గూడ నిదివఱలోవలె నభిమానులాదరించినచో నామున్ముందుపనులకుఁ గడుంగడు తోడగువా రగుదురు. ఇదియె నావిజ్ఞప్తి.

3 రాజగోపాలనాయకవీధి
చింతాద్రిపేట, మద్రాసు
మార్చి 18. 1914.

ఇట్లు
బుధజనవిధేయుఁడు
గా. హరిసర్వోత్తమరావు.

C. Ramaswamy Reddy

# పీ ఠి క

ఈ శ్రీరామచరిత్రము పోతనామాత్య కవిసార్వభౌమునిచే రచింపఁబడిన శ్రీమదాంధ్రభాగవతము నందలి నవమస్కంధములో నొకభాగము.

పోతనామాత్యుఁడు కడప మండలములోని ఒంటిమిట్ట గ్రామమునకుఁ జేరినవాఁడు. దీనినే ఇతఁడు ఏకశిలానగర మని భాగవతమునఁ బేర్కొనియున్నాఁడు.[1] ఇతఁడు నియోగిబ్రాహ్మ

1. హైదరాబాదుసీమలోని ఓరుగల్లు ప్రతాపరుద్రీయమునందును ప్రతాపరుద్రుని శాసనములను ఏకశిలానగర మనివ్యవహరింపఁబడి యుండుట చేత ఒకవేళ పోతనామాత్యుఁ డక్కడివాఁడయియుండ నోపునని ఇటీవల కొందఱు ఊహచేయుచువచ్చుచున్నారు. ప్రతాపరుద్రుని రాజధానికిఓరుగల్లు ఓరంగలు అని సాధారణవ్యవహారము. ఈపదములకు అర్థము ఒక్కరాయి. ప్రతాపరుద్రీయకర్త తెలుఁగును త్రిలింగ్యమన్నట్లే ఒక్కరాయి యనునర్థమిచ్చుఓరుగలునుఏకశిలానగరమనివ్యవహరించియుండును. ప్రతాపరుద్రీయకర్తవలెనే పోతనామాత్యుఁడు ఒంటిమిట్ట యనుదానిని ఏకశిలానగరంబని వ్యవహరించియుండు. కావున ఏకశిలానగర నామమాత్రమునఁ నేమియుఁ జెప్పవీలుపడదు. పోతనామాత్యుఁడు కడపమండలములోని యొంటిమిట్టనాఁడని బహుకాలముగ లోకములో వాడుక. విశేషకారణము లగుపడుదనుక నిదియే సత్యము.

ణుఁడు. కౌండిన్యగోత్రుఁడు. ఈతనితల్లిదండ్రులు లక్కమాంబా కేతనలు. వీరు శైవాచారపరులు. ఈతనియన్న తిప్పనయు శివభక్తుఁడు. ఇతఁడుమాత్రము అద్వైతశిరోమణియు సర్వమత సహిష్ణుఁడును అయ్యు రామభక్తాగ్రేసరుఁడయి వెలసినవాఁడు.

శ్రీమద్భాగవతమును బ్రకటించినవారిలో నొకరు 'బమ్మెర పోతనామాత్యుని జన్మకర్మప్రభావాదులఁ దెలిపెడు వచన రూపంబగు ప్రాచీనపండితజనలిఖితగ్రంథము'ను ఆధారముచేసి కొని ఇతఁడు శాలివాహనశకము ౧౩౦౦ ల సంవత్సరమున అనఁగా క్రీ. శ. ౧౩౭౮ వ సంవత్సరమున జనించె నని ప్రకటించియున్నారు. ఆగ్రంథమిప్పుడుకానవచ్చుటలేదు. కానవచ్చినను అందలివిషయము లెంతవఱకు విశ్వసనీయములో నిర్ణయించుకొనవలసి యుండును. అయిన పోతనామాత్యుని కాల నిర్ణయమున కొక్కయాధారము మాత్రము బలమయినది కలదు. ఇతఁడు భోగినీదండకమును వ్రాసి రావుసింగ భూవిభునకు అనఁగా సర్వజ్ఞసింగమ భూపాలునకు అంకితముచేసెను. "ఈసర్వజ్ఞసింగమ భూపాలుఁడు, క్రీ. శ. ౧౪౨౨ వ సంవత్సరము మొదలుకొని ౧౪౪౬ వ సంవత్సరము వఱకును విజయనగరాధీశ్వరుఁడుగానున్న ప్రౌఢ దేవరాయనితో సమకాలికుఁడు." కావున పోతనామాత్యుఁడు ౧౫ వ శతాబ్దపు ప్రథమార్ధమున నున్నవాఁడని తేలుచున్నది. పోతనయు శ్రీనాథుఁడును బావమఱందు లను ప్రతీతిని బట్టియు నిదియే తేలుచున్న



దని రావు బహదూరు వీరేశలింగము పంతులవారు వ్రాసియున్నారు.

పోతనామాత్యుఁడు శ్రీమద్భాగవతమును భోగినీదండకమునుగాక వీరభద్రవిజయమను మఱియొకగ్రంథమునుగూడ వ్రాసియున్నాఁడు. నరాంకితముచేయుట మహాపాతకమని పోతనామాత్యుఁడు భాగవతమున నభిప్రాయ మిచ్చియుండుటచేత భోగినీదండకము నతఁడు బాల్యమున రచించెనందురు. ఒకవేళ దారిద్ర్య మనుభవించి యనుభవించి విసిగి ముదుసలి యైన పిదప ధనాశచే నీదండకమును వ్రాసి యుండనోపు. వీరభద్రవిజయము భాగవతమునకుఁ దరువాత వ్రాయఁబడినట్లు అందే చెప్పంబడినది. కవిత్వము భాగవతమునందువలెఁగాక పటుత్వము తగ్గి పోతనకవిత్వము కాదని తోఁపించునట్లుండుటవలన పోతనామాత్యుఁడు అవసానకాలము సమీపించినప్పుడు అతఁడే చెప్పుకొనినట్లు దక్షయజ్ఞవర్ణనలో శివనింద చేసినదానికి ప్రతీకారముగా ఈవీరభద్రవిజయమును వ్రాసెనని తోఁచెడిని.

శ్రీరామచరిత్రమునందలి విశేషములు వ్యాఖ్యానమునందే అటనట సూచించినాఁడను. కవి మూలమునను సరించియే భాషాంతరీకరించి యున్నాఁడు. కాని కథానిర్వాహణకొఱకు మార్పులును, స్వతంత్రకల్పనలును, చేసియున్నాఁడు. ఈవ్యాఖ్యానమున ౬౨ వ పేజిలో సూచింపఁబడిన రామాయణకథాభేదము మూలములోనిదే కాని కథాంతమునందు వాల్మీకి సీతా

దేవిని రాములయెదుటికిం దెచ్చుటమూలములో లేదు. ఇంతియే
గాక సంస్కృత భాగవతకారుఁడు యేదోయొక కారణము
గల్పించి అయోధ్యాపుర వర్ణనాదికము రామకథానంతరము
శుకయోగి పరీక్షిత్తునకు చెప్పినట్లు వ్రాసియున్నాఁడు. పో
తనామాత్యుఁ డద్దానిని మార్చి రాముఁ డయోధ్యకు వచ్చు
ఘట్టమునఁ బొందుపఱచి యున్నాఁడు. భాషాంతరీకరించు
చుండినను పోతనాదులు స్వతంత్రకవులే యగుట ఇట్టివి వ్రా
యఁబూనిన నిట నధికప్రసంగమగు. కాన విరమించుచున్నాఁడ.

చదువరు లెల్లరు శ్రీమద్రామాయణకథనే ఎక్కువగా
నెఱింగియుండువారు గాన ఆకథకును భాగవత కథకును గల
తారతమ్యముల వ్యాఖ్యానమందుఁ గొంచెము విపులముగఁ గను
పఱిచినాఁడ.

పోతనామాత్యుని భాగవతమునుగుఱించియు అందలి కవి
త్వమునుగుఱించియు విపులముగ వ్రాయుట కిది యదనుగాదు.

ఈ మహాకవికవిత్వ మొకటిమాత్రమె తెలుంగుబాస
యందు పండితపామరు లెల్లరకును హృదయాకర్షకమయి పరఁగు
చున్నదనిన నీతనికవిత్వపు స్వభావము వెల్లడి కాఁగలదు. ఇతఁడు
శబ్దాలంకారవైచిత్ర్యమందఱు తెలుఁగుకవులకంటె నెక్కుడా
స్వాదనీయముగఁ జూపువాఁడే యయ్యును కావ్యగుణములఁ
బ్రదర్శించుటయందేమి, రసపోషణ చేయుటయందేమి, స్వభా



వానుగుణవర్ణనలయం దేమి, అది యిది యననేల కవిత్వమున
కుండఁదగిన సర్వాంగముల పొందించుటయందు ఎవ్వరికిని దీసి
పోవువాఁడు గాఁడు.

ఇట్టిమహాకవివరునిహృదయమెక్కడ? నే నెక్కడ? అయిన
నాకు నాతనియందుఁగల గౌరవంబును జూపుటకు నీవ్యాఖ్యా
నంబు వ్రాసినాఁడ. చదువరులామోదించినాకుఁ బ్రోత్సాహం
బొసంగిరేని ఇంక నిట్టికథ లొకకొన్నింటికి ఇట్టివ్యాఖ్యలు
వ్రాయ నున్నాఁడను.

పండితులు నాకు గురువులు. ఇందు లోపము లున్న శిష్య
వాత్సల్యంబున నాకుం దెలిపినఁ గృతజ్ఞుఁడ నై దిద్దికొనియెద.

3. రాజగోపాలనాయకవీథి
చింతాద్రిపేట, మద్రాసు
జనవరి, 26, 1913.

ఇట్లు
బుధజనవిధేయుఁడ
గా. హరిసర్వోత్తమరావు

C. Ramaswami Rao

శ్రీరస్తు

---

# శ్రీరామచరిత్రము

(సవ్యాఖ్యానము)



క. శ్రీరాజిత ! మునిపూజిత !
వారిధిగర్వాతిరేక వారణబాణా !
సూరిత్రాణమహోజ్జ్వల
సారయశస్సాంద్ర రామచంద్రనరేంద్రా !

టీ. శ్రీ=శుభములచేత, రాజిత = ప్రకాశింపఁ జేయఁబడిన వాఁడా ! ముని=మునులచేత, పూజిత = పూజింపఁబడినవాఁడా ! వారిధి=సముద్రుని, గర్వ = గర్వముయొక్క, అతిరేక = ఆధిక్యమునకు, వారణ = చెలియలి కట్టవంటి, బాణా = బాణములు కలవాఁడా ! సూరి=పూజ్యులను, త్రాణ= రక్షించుటయందు, మహోజ్జ్వల = మిక్కిలి ప్రకాశమానమయిన, సార = చేవచేత (నయిన), యశః=కీర్తియొక్క, సాంద్ర = అతిశయమునుగలవాఁడా ! రామచంద్రనరేంద్రా = రామచంద్రప్రభూ !

తా. సులభము.

వి. అం. ఈపద్యము భాగవతమునందలి నవమస్కంధములో మొదటిది. పోతనామాత్యుఁడు 'దనకిష్టదైవం బగు శ్రీరామునిందు సంబోధించుచున్నాఁడు. ఈసంబోధనంబునందె కవి ముందుఁ జెప్పఁబోవు విషయములలో రామాయణకథనము ముఖ్యతమ మని సూచించుచున్నాఁడు. వారిధిభంగంబును' విశ్వామిత్రయజ్ఞ సంరక్షణంబును, రామరాజ్యంబును సూచితములు.

'మహోజ్జ్వల' 'యశస్సాంద్ర' 'రామచంద్ర' యను పదములు పరస్పరము రసపోషకములు.

అల్ప ప్రాణములను అందును నతి పేశలములగు ర, ల, డ, ణ, లను బొంకముగఁ జేర్ప నేర్పుగలకవి యీతం డనుటకు నీపద్యము ప్రబలనిదర్శనము. ఈగుణంబునకు 'శ్లేషము' అని పేరు.

"క. అశిథిలపదబంధంబై
విశదాల్పప్రాణ వర్ణవిస్పష్టంబై
కుశలగతి నొప్పు శ్లేషము
విశేష కావ్యములకెల్ల విభవప్రదమై."

మ. అమరేంద్రాశకుఁ బూర్ణచంద్రుఁ డుదితుం
డై నట్లు నారాయణాం
శమునంబుట్టె మదాంధరావణ శిర
స్సంఘాత సంచ్ఛేదన[1]

1. 'విచ్ఛేదన' యనిపాఠాంతరముగలదు. కాని పోతన కనుప్రాసము సహజముగాన 'సంఛేదన' యనుటయే యుచితము.



క్రమణోద్దాముఁడు రాముఁ డాగరితకున్
గౌసల్యకున్ సన్నుతా
సమనైర్మల్య కతుల్య కంచితజను
స్సంసార సాఫల్యకున్ ౨

టీ॥ అమర = దేవతల (చావులేనివారు), ఇంద్ర=ప్రభువుయొక్క ఆశకు=దిక్కునకు (అనఁగా తూర్పుదిక్కునకు), పూర్ణ=నిండు, చంద్రుఁడు, ఉదితుండయినట్లు=పుట్టినట్లు, సన్నుత=పొగడఁబడిన, అసమ=సామాన్యము గాని, నైర్మల్యకు=నిష్కళంక చరిత్రకలదానికి, అతుల్యకు=సాటిలేనిదానికి, అంచిత=ఒప్పుచున్న, జనుః=పుట్టుక యొక్కయు, సంసారముయొక్కయు, సాఫల్యకున్=సార్థక్యముకలదానికి, ఆగరితకున్=(ఇట్లుసుప్రసిద్ధయయిన) ఆస్త్రీకి, కౌసల్యకు, మద=మదముచేత, అంధ=గ్రుడ్డివాఁడయిన, రావణ=రావణుని యొక్క, శిర=తలలయొక్క, సంఘాత=సంఘముయొక్క (రావణుఁడు దశముఖుఁడు గదా!), సంఛేదన=మొదలంటనఱకుటయను, క్రమణ=వ్యాపారమునందు, ఉద్దాముఁడు=అడ్డులేనివాఁడు, (అగు), రాముడు, నారాయణాంశమునన్=విష్ణువుయొక్క అంశమున, పుట్టె

తా. తూర్పుదిక్కునఁ బూర్ణచంద్రుఁడు పుట్టి చీకటిని ఖండించు విధమున సాటిలేనిదియు కళంకరహితమగుచరిత్రగలదియు,సుప్రసిద్ధయునగు కౌసల్యాదేవికి మదముచేత కండ్లుగానక ప్రవర్తించు రావణుని దునుమాడి లోకమునకు మహోపకారము చేయఁగల శ్రీరాముఁడు జన్మించి ఆమెజన్మ సాఫల్యము సమకూర్చెనని తాత్పర్యము.

వ్యా. అమర + ఇంద్ర=అమరేంద్ర. ఇదిసంస్కృతసంధి. దీనికి గుణ సంధియనిపేరు.అత్తునకుంబె పరంబగుఇ, ఉ, ఋ, ఌలకు (హ్ర)స్వములకును

దీర్ఘములకును) ఏ,ఓ., అర్, అల్ అనునవి యాదేశంబగుట గుణము నాఁబడు. నారాయణ + అంశ – నారాయణాంశ. ఇదియు సంస్కృతసంధియె. దీనికి సవర్ణ దీర్ఘ సంధియని పేరు. ఒక యచ్చున కదే యచ్చు పరంబగునపు డదే యచ్చు దీర్ఘంబయి యాదేశమగు నని సూత్రము.

కథ. దేవ .... యుద్ధమున భృగుమహర్షి దైత్యపక్షమవలంబించి దాని సేనను గోరుచుండెను. విష్ణువు ఆతని భార్యయొక్క శిరము దునుముటవలన నతఁడు గోపించు విష్ణువు మానవుఁడై జన్మించి భార్యావియోగదుఃఖమును అనుభవింపవలసినదని శపించెను. ఆ కారణమున రామావతారంబని కథ.

సా. సవరక్షార్థము దండ్రి వంపఁ జని వి
శ్వామిత్రుఁడుం దోడురా[1]
నవలీలన్ దునుమాడె రాముఁడదయుం
డై బాలుఁడై కుంతల
చ్ఛవిసంఛజ్జితహాటకం బగు సటభ్రా
షావిస్ఫురన్నాటకన్
జవభిన్నార్యమఘోటకం బగరవి రా
జత్ఖేటకన్ దాటకన్. 3

టీ. సవ = యజ్ఞమును, రక్ష = కాపాడుట, అర్థము = కొఱకు, తండ్రి, పంప, చని = పోయి, విశ్వామిత్రుఁడున్, తోడురా = (ఆశీర్వాదాదులచే) సాహాయ్యముచేయ, బాలుఁడై = బాలుఁడేయయినను, అదయుం

1. సర్వసాధారణముగ నిచ్చుపాఠము 'తోడరా'. ఇయ్యది సరసంబయినదిగాదు. ఏలయన, విశ్వామిత్రుఁడు వెంటపోగా ననియర్థము. ఇచ్చట విశ్వామిత్రుఁడు వెంటనుండుట విశేషాంశముగాదు. అతఁడు దశరథుని యొద్దకుబోయి రామలక్ష్మణులను దోడి తెచ్చుచున్నాఁడు. రామునకు విశ్వామిత్రుఁడు అనుచరుఁడుగ మాత్రము వచ్చుచుండెననుట ఇటపొసఁగదు. అతనికి తాటకాసంహార విషయమున నాసక్తిగలదు. కావున రామునకుఁ దన సాధ్యమగు సాహాయ్యముచేయవలెనను కుతూహలము అతనికిఁ దప్పక యుండును.

'తోడురా' యనుపాఠాంతరము 'తోడరా' యనుదానికంటెరసవత్తరముగనున్నది. తోడురా, యనునెడ తోడరాయందలి యర్థమును ఉన్నది. అంతకంటె నెక్కుడునుగలదు. తాటకాసంహారమే ఈపద్యమునవిషయము.



అప్పటికి విశ్వామిత్రుఁడు దీక్షవహించియుండలేదు. తాటక "అర్చుచు నేగుదేరఁ" జూచి "సంయమి ప్రవరుండు (విశ్వామిత్రుఁడు) భూరివాక్యముల భర్జనసేయుచు నాత్మలోన రాఘవులకు సేమమున్ జయముగల్గెడు మంచును గోరు,, చుండెనని ప్రసిద్ధము. మునిప్రవరుఁడు చేయు సాహాయ్యమెప్పుడు నింతియ గాదా! ఈసాహాయ్యంబు చాలదా? కావున 'తోడరా' యనుటకంటె 'తోడురా' యనుపాఠమె లెస్స. ఒకటిరెండు పదముల బలంబునఁ గథ నెఱుక చేయుట కవిసామర్థ్యంబు సుమా!

తోడురా యనునప్పుడు రామునకుండఁ దగినప్రాముఖ్యత పోవుచున్నదని కొందఱ మతము. కాని ఆశీర్వాదాదులచే విశ్వామిత్రుఁడు సాయము చేసెననుట రాముని శక్తికిఁగాని ప్రతాపమునకుఁగాని కొఱంత గాదు! తోడరాయను పాఠము నిలిపినను సవరక్షార్థ మని పద్యాదిని పేర్కొన్న ప్రయోజనఫలము విశ్వామిత్రునకుఁ జెందఁ దగినదని సమన్వయము గలదు. కాని ఇట్టి సమన్వయము 'తోడురా' యం దెక్కుడుచితమని నాయభిప్రాయము.

డై=దయలేనివాఁడయి, రాముఁడు, అవలీలం=సునాయాసముగా, కుంతల=ముంగురుల, ఛవి=కాంతి, సంపత్=సంపత్తుచేత, జిత=జయింపఁబడిన, హాటకకన్=సువర్ణముగలదానిని(అనఁగాఁ దాటకయొక్క ముంగురులు బంగరునకంటె నెక్కుడువర్ణము గలవిగ నుండెనని యర్థము. ఎఱుపు తక్కువగను పసుపు ఎక్కుడుగను గల రంగు బంగారురంగు. ఈరాక్షసిముంగురులు పసపుకొలఁదిగను ఎఱుపు ఎక్కుడుగను గలవిగ నుండియుండును. అంతువలన నీవర్ణన), కపట=కుటిలమైన, భాష=మాటలచేత, విస్ఫురత్=వెల్లడియగు, నాటకకన్=ప్రవర్తనముగలదానిని, జవ=వేగముచేత, భిన్న=భేదింపంబడిన, అనఁగా నోడింపఁబడిన, అర్యమ=సూర్యునియొక్క, ఘోటకః=గుఱ్ఱములుకలది, అనఁగా గమనమునందు సూర్యునికంటె శీఘ్రముగలది యనియర్థము, కర=చేతియందు, విరాజత్=ఒప్పుచుండు, ఖేటకకన్=డాలుకలది (అగు), తాటకను, తునుమాడె=చంపెను.

తా. తండ్రి యుత్తరువుగొని విశ్వామిత్రమహర్షి యొక్క యజ్ఞమును గాచుటకుఁ బోవుచు దయవీడి ఎఱ్ఱవెండ్రుకలను కపట ప్రవర్తనయు అతివేగగమనమును గలిగి సంరక్షణార్థము డాలు పట్టినదియగు తాటకను సంహరించెను.

వ్యు. విశ్వామిత్ర పదముయొక్క వ్యుత్పత్తిని గమనింపవలయును. ఇయ్యది విశ్వ+మిత్ర యనువాని కూడికచే నైనది. మధ్య నాదేశం బగు ఆకారము ఈపదమునందు విశేషము. పాణిని ఈపదముమాత్రమునకె ఒక్క సూత్రమును గల్పించియున్నాఁడు. హరిశ్చంద్రాదిపదంబులిట్టివి సంస్కృతంబున నింకనుగలవు.



వి. అం. బాలుఁడై, అదయుండై, కరవిరాజత్ఖేటకన్, ఈమూఁడుపదములును ప్రయోగ వైచిత్ర్యము గలవి. మొదటి పద్యమున శ్రీరామజననము మాత్రము చెప్పి మధ్యకథయంతయు వదలి విశ్వామిత్రసవరక్షణమునకువచ్చుటంజేసి యప్పటికి శ్రీరాముఁడు బాల్యావస్థయందుండెననుటకు 'బాలుఁడై' యను పదము. సాధారణముగ బాల్యమున ఎదుటి వారెంత దుర్మార్గులయినను దయ వీడుట సంభవింపదు. ఇటవిశ్వామిత్రునివలన ప్రబోధితుఁడుగాన రాముఁడు దయవీడినట్లు వర్ణన. విశ్వామిత్రునకును రామునకును స్త్రీని చంపువిషయములో జరిగిన సంవాద మిచట సూచితము.

కరవిరాజత్ఖేటకన్. అనుటలో డాలును మాత్రము వర్ణించుటవలన నారాక్షసిబాణాదుల నుపయోగింపలేదనుట వ్యక్తము. తరు శిలాదులే దానికి యుద్ధోపకరణంబు లని భావము.

క. గా రామునఁ గౌశికమఖ
మా రాముఁడు గాచె; [1] దైత్యు నధికు సుబాహున్
ఘోరాజిఁ ద్రుంచి తోలెను
మారీచున్ నీచుఁ గపటమంజులరోచున్. ౪

---

1. సాధారణముగఁ గానవచ్చు పాఠము 'కాచి'. ఈపాఠమును స్వీకరించినయెడల మారీచుని తోలుట ఈపద్యమున ముఖ్యవిషయముగఁ దేలుచున్నది. రాముఁడు గౌశికమఖమును గాచి సుబాహుని యుద్ధమునఁ ద్రుంచి మారీచుని దోలెనని చెప్పవలసి యున్నది. అయినకథ ననుసరించితిమేని ఈపద్యమున ముఖ్యవిషయము విశ్వామిత్రసవరక్షణము. అందులకై సుబాహువును ద్రుంచుట, మారీచుని దోలుట. కావునఁ గాచెనను సమాపకక్రియను స్వీకరించినఁదరువాతి పద్యభాగము అంతవఱకుంగల 'గా రామునఁ గౌశికమఖ మా రాముఁడు గాచె'నను వాక్యమునకు విపులీకరణమయి యొప్పఁ గలదు.

టీ. ఆరాముఁడు = (తాటకాసంహారమొనరించి ప్రసిద్ధుఁడైన) రాముఁడు, గారామున = ప్రేమచేత, కౌశికమఖము=విశ్వామిత్రునియజ్ఞమును, కాచె=సంరక్షించెను. దైత్యు=రాక్షసుని, అధికు=బలవంతుని,సుబాహుక్=సుబాహువను వానిని, ఘోరమైన, ఆజిక్ =యుద్ధమున, త్రుంచి, నీచు, కపట=కుటిలుఁడయి, మంజుల=మనోహరమైన, రోచుక్ =కాంతిగలవానిని, మారీచుని, త్రోలెను (సముద్రములోఁ బడఁ ద్రోసెనని కథ)

తా. రాముఁడు విశ్వామిత్రునియందు ప్రేమగలవాఁడయి బలవంతుఁడగు సుబాహువును యుద్ధమునఁ జంపి మాయలకు పుట్టినిల్లగు మారీచుని సముద్రములోఁ బడునట్లు తఱిమి ఋషివర్యుని యజ్ఞమును గాపాడె నని తాత్పర్యము.

మ. ఒకమున్నూఱుగదల్చి తెచ్చిన లలా
టోగ్రాక్షు చాపంబు బా
లకరీంద్రంబు సులీలమైఁ జెఱకుఁ గో
లంద్రుంచుచందంబునన్
సకలోర్వీశులు సూడఁగావిఱిచె దో
శ్శక్తిక్ విదేహక్షమా
పక గేహంబున సీతకైగుణమణి
ప్రస్ఫీతకై లీలతోన్.

టీ. బాల+కరి+ఇంద్రము=శ్రేష్ఠమయినగున్న ఏనుఁగు,సులీలమైన్=ఆటచేవలె అనఁగా కష్టములేక, చెఱకు కోలను త్రుంచు చందమున,విదేహక్షమాపక=విదేహదేశపురాజగు జనకునియొక్క, గేహంబున=ఇంటియందు, ఒక మున్నూఱు=మూఁడువందల ప్రజ,కదల్చి, తెచ్చిన, లలాట+ఉగ్ర+



అక్షు=నొసట తీవ్రమగుఁ గన్నుగలవాని (శివుని) యొక్క, చాపంబు = విల్లును, సకల+ఉర్వి+ఈశులు=అందఱుభూమిపతులు,చూడఁగా,సీతకై, గుణమణి ప్రస్ఫీతకై=శ్రేష్ఠమయిన గుణములు కొల్లలుగఁ గలదానికై, లీలతోన్ = క్రీడ తెఱంగున, రాముఁడు (అధ్యాహారము). దోశ్శక్తిని=బాహుబలమువలన, విఱిచె.

తా. మూఁడువందలజనులు గదల్చికొని తెచ్చిన శివుని విల్లును శ్రీరాముఁడు సీతను బెండ్లియాడుటకయి జనకునింట సునాయాసముగాఁ ద్రుంచివైచెను.

వ్యా. చెఱకుఁగోల. సమాసంబుల నుదంతంబులగు స్త్రీసమంబులకుం బరుష సరళంబులు పరంబులగునపుడు నుగాగమంబగు. ఆదేశసరళములకుముం దున్న ద్రుతమునకు బిందుసంశ్లేషములు విభావనగు.

క. భూతలనాథుఁడు రాముఁడు
ప్రీతుండై పెండ్లియాడెఁ బృథుగుణమణి సం
ఘాతన్ భాగ్యోపేతన్
సీతన్ముఖకాంతి విజితసితఖద్యోతన్ ౬

టీ. భూతలనాథుఁడు= రాజు (రాముఁడు,) ప్రీతుండై=అనురాగముకలవాఁడయి, పృథు = గొప్పవగు, గుణ = మంచిగుణములనెడు, మణి = మణులయొక్క, సంఘాతన్ = సమూహమయినదానిని, భాగ్య =అదృష్టముచేత, ఉపేతన్ = కూడుకొనినదానిని, ముఖ = మోముయొక్క, కాంతిచేత, విజిత = జయింపఁబడిన (తిరస్కరింపఁబడిన), సితఖద్యోతన్ = చంద్రుఁడు కలదానిని, సీతను, పెండ్లియాడెను.

తా. సద్గుణములుకలదియు అదృష్టవంతురాలును చక్కనిదియు నగు సీతను రాముఁడు వివాహమాడెను.

వి. అం. సితఖద్యోతక్, ఖ - అనఁగా ఆకాశము, అందు ద్యోత ప్రకాశించునట్టిది. ఖద్యోతశబ్దము చంద్రసూర్యాదులకెల్లఁ బ్రవర్తించు. ఆ యనను సంస్కృతంబున నీపదంబునకురూఢ్యర్థముసూర్యుఁడు. సితయనఁగా ధవళమయిన (తెల్లని) యనియర్థము. ఇయ్యది చేరుటంజేసియు ముఖమునకు నుపమానముగ నుడువంబడుటంజేసియు సితఖద్యోత శబ్దముచేఁ జంద్రుఁడు గ్రాహ్యుఁడు.

వి. అం. ఇందు రాముని భూతలనాథుఁడుగ వర్ణించుటవలనను సీతను బృథుగుణమణి సంఘాతగా వర్ణించుటవలనను రత్నగర్భకు నాథుఁడైన ఈనృపాలుఁడు కేవలధనరూపంబగు మణులనుమాత్రముగాక గుణమణులనుగూడ ఏలెనని ధ్వనింపఁజేయుట కవిసామర్థ్యముగదా. (రాజులు రత్నప్రియులనియుఁ బ్రమాణము.)

ఇఁక సీతను ఆదిని 'పృథుగుణమణి సంగఘాతగను', తరువాత 'భాగ్యోపేత' గను, కడపట, 'ముఖకాంతివిజితసితఖద్యోత' గను వర్ణించుటగవికిఁగల యౌచిత్యాదరము వెల్లడించుచున్నది. రాముఁడు ప్రీతుఁడగుటకు ముఖ్యతమ కారణము సీతయొక్కగుణసంపత్తియనియు సౌందర్యాదు లుపకారణంబులనియు నేతన్మూలముగ సూచితము.

క. రాముఁడు నిజబాహాబల
స్థేమంబున భంగపఱిచె దీర్ఘకుఠారో
ద్దాముః విదళీకృతనృప
ధాముః రణరంగభీము భార్గవరామున్. ౭

టీ. దీర్ఘ=పొడవైన, కుఠార = గండ్రగొడ్డలివలన, ఉద్దాముః = అడ్డులేనివాఁడైనట్టియు, విదళీకృత=బ్రద్దలుచేయఁబడిన, నృప=క్షత్రియుల, ధాముః = తేజము గలవాఁడైనట్టియు, రణరంగ = యుద్ధభూమియందు



భీముః = భయంకరుని, భార్గవరాముః = భృగునందనుఁడయినరాముని, రాముఁడు, నిజ=తన, బాహువులయొక్క, బలముయొక్క, స్థేమంబునః= దార్ఢ్యముచేత, భంగపఱిచె=అవమానపఱిచె.

తా. తనబలముచేత శ్రీరాముఁడు క్షత్రియకుటుంబమున కంతటికిని యముఁడువోలెఁ బ్రవర్తించుచుండిన పరశురాముని నవమానపఱిచెను.

కథ. శ్రీరాముఁడు శివుని విల్లు విఱుచుటవిని క్షత్రియకుల నిర్మూలన దీక్షాపరుండగు పరశురాముండు ప్రతిఘటించి వచ్చి తన కరంబున నుండిన విష్ణుదేవుకార్ముకమును ఎక్కుపెట్టి ఏయుమనుఁడు శ్రీరాముఁడా చాపంబుతోడ నారాముని దైవిక కళల నాకర్షించి గుణమవలీలఁగ సంధించిన నతఁడు నిర్వీర్యుండై రాముని నుతించి 'జితోఽస్మి' యనెను. భార్గవుఁడు క్షత్రియ కపాలములచే వైకుంఠమునకు నేర్పఱచుకొనిన సోపానపరంపరను శ్రీరాముఁడాబాణంబున భగ్నంబు చేసె.

క. దశరథుఁడు మున్ను కైకకు
వశుఁడై తానిచ్చినట్టి వరముకతన వా
గ్దశ సెడక యడవి కనిచెను
దశముఖముఖకమల తుహినధాముః రాముః ౮

టీ. మున్ను=పూర్వము, కైకకు, వశుఁడు = లోనయినవాఁడయి తాను, ఇచ్చినట్టి, వరము, కతన = కారణముగ, వాక్+దశ=మాటయొక్క యునికియందు, అనఁగామాటయని భావము, చెడక, దశముఖ = రావణుని, ముఖ=మోములనియెడు, కమలములకు, తుహినధాముః = చంద్రుఁడయిన వానిని, రాముని, దశరథుఁడు, అడవికి, అనిచెను=పంపెను.

తా. తాను కైకకు ఒకప్పుడు చేసిన వాగ్దానము నిలుపుకొనుట కొఱకు దశరథుఁడు రాముని వనవాసమునకు నని పెను.

వ్యా. ఇట వాగ్దశ సెడక యనుటలో 'చెడు' ధాతువు సకర్మకము గాదు. 'వాగ్దశయందు చెడక' యనిసమన్వయముచేసికొనవలెను. సప్తమ్యర్థంబందు ప్రథమ యనవలయు.

వ్యు. దశరథుఁడు. అనేక రథములుగలవాఁడు. 'దశ' శబ్దము అనేకార్థమునందు నుపయోగించుట గలదు. ఈదశరథశబ్దమునకు గాళిదాసు విచిత్రమగు నర్థమును చెప్పుచున్నాఁడు.

శ్లో. దశరశ్మి శతోపమద్యుతిం యజసాదిత్తుదశస్వపిశ్రుతః
దశపూర్వరథం యమాఖ్యయా దశకంఠారిగురుం విదుర్బుధాః

దశకంఠుని వైరియగుశ్రీరాముని జనకుఁడగుటచేతను దశరశ్మిశతుండనఁ బరగు సూర్యుని తేజస్సువంటి తేజస్సుగలవాఁడగుటచేతను దశదిశలయందును దనకీర్తిని నించినవాఁడగుటచేతను బుధులీతనిని దశశబ్దము పూర్వమునందుఁగల 'రథ' నాముఁడనియెఱుంగుచుండిరఁట! నిరంకుశాఃకవయః. కవులునిరంకుశులు గదా!

తుహినధాముఁడు. మంచునకు నిలయమయినవాఁడు. చల్లదనముంబట్టియు స్వచ్ఛశ్వేతవర్ణముంబట్టియుఁ జంద్రునికీనామంబు.

వి. అం. దశముఖుని ముఖములకు గమలములను బోల్చుటచింత్యము. రాముఁడు తుహినధాముఁడని వర్ణించుట కవికి మొదటఁ బొడముటచేతను గవి కవిసమయములపై యను ప్రాసమునకై యాధారపడుటం జేసియు నీచింత్యాంశము పోతనామాత్యుని కవిత్వమున కెక్కినది.

కథ. "జయంతపురంబునం బురందర శంబరులకుం గయ్యంబగుచున య్యింద్రునకుందోడరిగి దశరథుండు భండనంబు సేయునవసరంబున నారాత్రి



కుం డనేక మాయలుగావింప" కైకేయి "ధవళాంగుం డనుమునివలనం బడసిన మంత్రవిద్యచేతవానికిం బ్రతీకారంబులొనర్చుటచే మెచ్చి" ఆమెకుదశరథుండు రెండువరంబులిచ్చె. ఈమె వీరమాతగదా!

క. జనకుఁడు వనిచిన మే లని
జనకజయును లక్ష్మణుండు సంసేవింపన్
జనపతిరాముఁడు విడిచెను
జనపాలారాధ్యద్విషదసాధ్య[1] నయోధ్యన్

టీ. జనకుఁడు=తండ్రి, పనిచిన, మేలని, జనకజ = జనకునికూఁతురు (సీతయు)ను, లక్ష్మణుండును, సంసేవింపన్=లెస్సగా(అనఁగాభక్తితోడుత) కొలుచుచుండ, జనపతి=రాజయిన, రాముఁడు, జనపాల =రాజులకు, ఆరాధ్య=పూజింపఁదగినదియు. ద్విషత్=శత్రువులకు, అసాధ్య = జయింపరానిదియు (నగు), అయోధ్యను విడిచెను.

తా. పితృవాక్పరిపాలనార్థము సీతాలక్ష్మణసమేతుండై రాముఁడు అయోధ్యను విడిచి చనెను.

వి. అం. 'మేలని' యనుటలో రాముఁడు తండ్రియాజ్ఞను సంపూర్ణహృదయముతో నెఱవేర్పసమకట్టెననుటవిశదము. రాఁబోవుకథా భాగంబు నీశబ్దంబుచే సూచితము. ఎట్లన రాముఁడు పడుకష్టంబులెల్లయు నతని యశస్సునకే కారణంబులు. అంత్యఫలంబును నాతనికి శుభంబ

రాముఁడు 'జనపతి' యని వర్ణితుఁడు. ఇందుఁజదువరులకుసందియంబు వొడమవచ్చును. పట్టాభిషిక్తుఁడు గాకమున్నె జనపతి ఎట్లయ్యెను? అని. కాని రాముఁ డడవులనుండినప్పుడుంగూడ నాతని పాదుకలే సింహాసనము

1. 'అసదసాధ్య' యనియు 'సవన సాధ్య' యనియు పా. అం.

నధిష్ఠించుటంబట్టియు రాముని పేరటనె భరతుఁడు రాజ్యమేలుటం బట్టియు నీవర్ణన సముచితంబు.

'జనపాలారాధ్య' యనుటలో నితరరాజులే ఈయయోధ్యను విడువలేక పూజించుచుండ రాజ్యార్హుండగు రాముఁడువిడుచుట కేవలము పితృవాక్యపరిపాలనార్థంబె యనియు అతనికి నయోధ్యపయి జన్మభూమివాత్సల్యము మెండనియు సూచితము. అయోధ్యయనుపదమునందే 'ద్విషదసాధ్య' పదము యొక్కయర్థము ఇమిడియుండ రెండును ఏలయని ద్విరుక్తిదోషంబారోపింపవచ్చును. కాని యయోధ్య నామమాత్ర 'మయోధ్య' (శత్రువులకు జయింపరానిది) గాక సార్థకనామధేయంబని యిటఁ జెప్పవలసి యుండుటం జేసి ఈ ప్రయోగమని యెఱుంగునది.

క. భరతున్ నిజపదసేవా
నిరతున్ రాజ్యమున నునిచి నృపమణి యెక్కెన్
సురుచిరరుచి పరిభావిత
గురుగోత్రాచలముఁ జిత్రకూటాచలమున్. ౧౦

టీ. నిజ=తనయొక్క, పద = పాదములయొక్క, సేవా = కొలువునందు, నిరతున్=భక్తిగలవానిని, భరతుని, రాజ్యమున, ఉనిచి=ఉంచి, సురుచిర = మంచిప్రకాశముగల, రుచి = కాంతిచేత, పరిభావిత = తిరస్కరింపఁబడిన, గురు=గొప్పవగు, గోత్రాచలమున్= కులపర్వతములు గలదియగు, చిత్రకూటపర్వతమును, నృపమణి=రాజశ్రేష్ఠుఁడు అనఁగా రాముఁడు, ఎక్కెను.

తా. రాముఁడు భరతుని రాజ్యమునకు నియోగించి గొప్పవగుఁగుల పర్వతములనుగూడ కాంతియందు మించిన చిత్రకూటపర్వతము నెక్కెను.



వి. అం. "చిత్రకూటము ప్రయాగకుఁ బది క్రోశముల దూరమునం దుండినట్లున్నది. ప్రస్తుతపు లెక్కననుసరించి ప్రయాగకుఁ జిత్రకూటము ౭౫ మైళ్లున్నది". 1 చిత్రకూట పర్వతము సామాన్యపర్వతము. రామాయణ కథ ననుసరించి రాములవారు భరద్వాజమహర్షి దర్శనముచేసికొని చిత్రకూటమునకు వచ్చిచేరిరి. భరతుఁడు శ్రీరాములనుజూచుట కిటకే వచ్చెను. కావున పోతనామాత్యవిరచిత పద్యంబు కథకు విరోధముగ నున్నట్లు గన్పించుచున్నది. కాని, దీని నొకవిధంబుగ సమర్థింపనగునని తోఁచెడిని. రాములవారు ప్రయాగనుండి పశ్చిమ ముఖంబునఁ బ్రయాణముచేసి చిత్రకూట పశ్చిమభాగమునఁ గొంత కాలము వసించి యచ్చటనె భరతుని రాజ్యమునకు నియ్యకొలిపి ముందుచనువాఁడై దక్షిణముఖంబున చిత్రకూటమును ఎక్కెనని తెలియుచున్నది. ఈ విధంబె ముందు పద్యముచే స్థిరపడుచున్నది.

కులపర్వతములు ఏడు—మహేంద్రము, మలయము, సహ్యము, శుక్తిమంతము, ఋక్షము, పారియాత్రము.

ఉ. పుణ్యుఁడు రామచంద్రుఁ డట
పోయి ముదంబున గాంచె దండకా
రణ్యము దాపసోత్తమ శ
రణ్యము నుద్ధతబర్హిబర్హ లా
వణ్యము గౌతమీవిమల
వాఃకణపర్యటనప్రభూతసా
ద్గుణ్యము నుల్లసత్తరుని
కుంజవరేణ్యము నగ్రగణ్యమున్. ౧౧

1. కే. వి. లక్ష్మణరావుగారి హిందూ మహాయుగము. ప్ర. ౩.

టీ. అటవోయి = అవలదాఁటి చని, తాపస + ఉత్తమ + శరణ్యము = మునిశ్రేష్ఠులకు నిలువ నీడనిచ్చునది అనఁగా వాసస్థానమయినదియు, ఉద్ధత = తీవ్రఁబ్రకటించు, బర్హి = నెమళులయొక్క, బర్హ = పింఛముల యొక్క, లావణ్యము = సొంపుగలదియు, గౌతమీ = గోదావరినదిలోని, విమల = పవిత్రమైన, వాఃకణ = నీటి బిందువులయొక్క, పర్యటన = ప్రసారమువలన, ప్రభూత = పుట్టిన, సాద్గుణ్యము = ఉత్కృష్టగుణము కలదియు, ఉల్లసత్ = సంతోషమును బుట్టించు, తరు = వృక్షములచేతను, నికుంజ = పొదరిండ్లచేతను, వరేణ్యము = శ్రేష్ఠమైనదియు, అగ్రగణ్యము = మొదట నెన్నదగినదియు, నగు దండకారణ్యమును 1, పుణ్యుఁడు, రాముఁడు, ముదంబున = సంతసమున, కాంచెను.

తా. అనేకమునిశ్రేష్ఠులకు నివాసంబయినదియు నెమళ్ళయాటలకునికి పట్టయినదియు గోదావరిజలములచేత పవిత్రముచేయఁబడినదియు మంచిచెట్ల చేతను పొందరిండ్లచేతను చూపరుల నాకర్షించునదియు నగుదండకారణ్యమును పుణ్యపురుషుఁ డగు శ్రీరాముఁడు చూచెను.

---

1. "ఇది మిక్కిలివిస్తీర్ణమైనయరణ్యము. ఇందుసంఖ్యాతీతబుష్యాశ్రమములును రాక్షసనివాసస్థలంబులును ఉండెను. ఈమహారణ్యమునకు నుత్తరమున గంగానది యొక్కదక్షిణతీరమును, వింధ్యపర్వతమును, పశ్చిమమున ఉత్తరవింధ్యము, అత్ర్యాశ్రమము, దక్షిణవింధ్య, దక్షిణకోసలము, విదర్భదేశము దక్షిణాపథము, మలయాద్రియు, దక్షిణమున ద్రవిడ పాండ్యదేశములును, తూర్పున నుత్కళ, కళింగ, ఆంధ్రచోళదేశములును ఉండెను."

హిందూమహాయుగము.



వి. అం. రామచంద్రునకుఁ బుణ్యుఁ డను విశేషణము నుపయోగించుటయు తాపసులయొక్కయు గోదావరిపవిత్రోదకములయొక్కయు ప్రశంస సేయుటయు వీని పరస్పర రసపోషణార్థంబె, పోతనామాత్యుఁడు రామాయణకథను మిక్కిలి సంక్షిప్తముగఁ జెప్ప నెంచినవాఁడుగావున చిన్ని పదములతో కథాభాగమును సూచించుచు వచ్చుచున్నాఁడు. పుణ్యుఁడు; ముదంబున, కాంచెను అను పదములచే రాముఁడు కార్యవిహీనుఁడును ఉత్సాహరహితుఁడును నై దూరమునుండి చూచినవాఁడు గాఁ డనియు నతఁడు కార్యదీక్షవహించి సంతోషమునఁ బెక్కుపనులు దీర్చుచు దండకారణ్యమును గలయఁ దిరిగి దానిపవిత్రతను హెచ్చించె ననియు కవి కథను నిర్వహించి యున్నాఁడు.

సీ. ఆవనంబున రాముఁ డనుజ సమేతుఁ డై
సతితోడ నొకపర్ణశాలనుండ
రావణు చెల్లెలు రతిగోరి వచ్చిన
ముగి లక్ష్మణుఁడు దాని ముక్కుగోయ
నదివిని ఖరదూషణాదులు పదునాల్గు
వేలువచ్చిన రామవిభుఁడు గలన
బాణానలంబున భస్మంబుగావింప
జనకనందనమేని చక్కఁదనము
విని దశగ్రీవుఁ డంగజ వివశుఁ డగుచు
నర్థిఁబంచినఁ బసిడిఱ్ఱి యై నటించు
నీచు మారీచు రాముఁడు నెఱివధించె
నంతలో సీతఁగొనిపోయె నసురవిభుఁడు. ౧౨

టీక. ఆవనంబున = ఆయరణ్యమున, అనుజసమేతుఁడై = తమ్మునితోడంగూడ, సతితోడ = సీతాదేవితోడ, ఒకపర్ణశాలన్, ఉండ, రావణుచెల్లెలు శూర్పణఖ, రతి = క్రీడను, కోరి, వచ్చిన, మొగి = పూని, లక్ష్మణుఁడు, ముక్కు, కోయ, అది, విని, ఖర దూషణ, ఆదులు = మొదలగువారు, పదునాలుగు వేలు, వచ్చిన, కలన = యుద్ధమునందు, రామవిభుఁడు, బాణానలంబున = అస్త్రముల యగ్నివలన, భస్మంబుగావింప = బూడిదెచేయ అనఁగా నశింపఁజేయ, జనకనందన = సీతయొక్క, మేనిచక్కఁదనము= సౌందర్యమును, దశగ్రీవుఁడు = రావణుఁడు, విని, అంగజవివశుఁడగుచు = మన్మథునకులోనై—అనఁగా మోహపరవశుఁడయి, అర్థిన్ = పనికొఱకు, పంప, పసిఁడి=బంగరు, ఇఱ్ఱి=జింక, అయి, నటించు=కౌటిల్యముతోఁ బ్రవర్తించు, నీచున్, మారీచుని, రాముఁడు, నెఱి = పూర్తిగ, వధించె=చంపెను. అంతలో = ఆలోపల — అనఁగా మారీచుని రాముఁడు చంపులోపల—అసురవిభుఁడు = రాక్షసరాజు రావణుఁడు, సీతను, కొనిపోయెను.

తా. ఆయరణ్యమున రాముఁడొకపర్ణశాలయందు నివసించుచుండెను. అచ్చటికి రామునిఁగోరి రావణుని చెల్లెలు శూర్పణఖ వచ్చెను. లక్ష్మణుఁడు దాని ముక్కుగోసి పంపెను. ఖరుఁడు దూషణుఁడు మొదలగు పదునాలుగు వేవురు రాక్షసులు శూర్పణఖపరమున రామునితో యుద్ధము చేయ నేతెంచిరి. రాముఁడు వారినందఱను వధించెను. రావణుఁడు సీతయొక్క సౌందర్యగౌరవంబును(శూర్పణఖవలన) విని కుటిలుఁడగు మారీచుని బంగరు జింకయయి మెలఁగు మని పంపెను. రాముఁడా జింకనఁ దునుమాడెను. కాని, అతఁడా పనియందుండ రావణుఁడు సీతను ఎత్తుకొనిపోయెను.



వ్యు. అ. దశగ్రీవుఁడు ; పదికంఠములుగలవాఁడు. అనుజ ; తరువాత బుట్టినవాఁడు. నానా. అ. వనము.—అరణ్యము, జలము, తోఁట.

'మొగి', 'అర్థి', 'నెఱి' యను మూఁడుపదంబులును మొట్టమొదట పాదపూరణార్థంబులా యను సందియమును గొందఱకుఁగలుగఁజేయవచ్చును. అయినఁ బోతనామాత్యుని కవిత్వమున సాధారణముగ నిట్టిదోషము లుండఁజాలవుగదా? 'మొగి' యన పూనికతో ననికదా యర్థము వ్రాసితిమి. లక్ష్మణుఁడు శూర్పణఖను జంపఁశక్తిగలవాఁడె యయ్యును స్త్రీహత్యకూడదుగానఁ బూనికపట్టి దానినివిరూపిని జేయవలసివచ్చెను. రఘువంశమున కాళిదాసు ఈవిషయమును వర్ణించుచో శూర్పణఖకు లక్ష్మణుఁడు వైరూప్యపౌనరుక్త్యమును ఘటింపఁజేసె ననుచున్నాఁడు.[1] శూర్పములఁ బోలు అనఁగా చేటలఁబోలు నఖములుగల రాక్షసి యగుట మొదటనే ఇది కురూపి. లక్ష్మణుఁడు ముక్కుగోసి ఆవైరూప్యము నినుమడించె నని యర్థము.

'అర్థిన్' అనుపదంబు మిక్కిలి రసవంతముగ గథాభాగంబును స్ఫురింపఁజేయు చున్నది. ఇట కార్యార్థియయి యని యర్థము వ్రాయఁబడియెను. శూర్పణఖ రావణునకుఁ దనపరాభవంబును సీతాదేవి సౌందర్యంబును వర్ణించుటాదిగ మారీచుఁడు మాయామృగంబయి బయలుదేరు వఱకుంగల కథ ఈపదబలంబున సూచితము.

'నెఱి' అనుపదమునకుఁ బూర్తిగ యనియర్థము. నాలుగవపద్యమున మారీచుఁడు సముద్రములోనికిఁ ద్రోలఁబడుట వర్ణితమయి యున్నది. ఇచ్చట అట్టి కార్యముగాదు. ఇదియ ఇట సూచితము.

---

1. పర్ణశాలామథక్షిప్రం వికృతాసిః ప్రవిశ్యసః
వైరూప్యపౌనరుక్త్యేన భీషణాం తామయోజయత్.

పోతనామాత్యుఁ డీ పద్యమున రామాయణమునందలి కథను విశేషము సంకుచితముచేసి వర్ణించియున్నాఁడు.

> ' బాణానలంబున భస్మంబుగావింప
> జనకనందనమేని చక్కఁదనము
> విని దశగ్రీవుఁ డంగజ వివశుఁ డగుచు, '

ననుటలోఁ గవి యొక్కఁగంతు వైచినట్లు గన్పట్టెడినిగాదె. శూర్పణఖ దగ్గఱనుండిన ఖరదూషణాదుల గొనివచ్చి వారు ఓడిపోఁగ దూరస్థితుండగు అన్నకు రావణునకుఁ దనపరాభవంబును సీత సౌందర్యంబును వర్ణించుకొనెను. రావణుఁడు రాక్షసుఁడగుటవలన చెల్లెలి పరాభవమున కంటెను సీతాదేవి చక్కఁదనమే యాతని కార్యదీక్షకుఁ గారణం బయ్యెనని ప్రాతపోషణము.

ఉ. ఆ యసురేశ్వరుండు వడి
　　　　నంబరవీధి నిలాతనూజ న
　న్యాయముసేసి నిష్కరుణుఁ
　　　　డై కొనిపోవఁగ నడ్డమైన ఘో
　రాయతహేతిద్రుంచె నస
　　　　హాయత రామనరేంద్ర కార్యద
　త్తాయువుఁ బక్షవేగపరిహాసిత
　　　　వాయువు నజ్జటాయువున్. ౧౩

టీ. అసుర + ఈశ్వరుండు = రక్కసుల ఱేఁడు రావణుఁడు, అన్యాయముచేసి, నిష్కరుణుఁడై = దయమాలినవాఁడయి, అంబరవీధిన్ = ఆకాశ మార్గమున, ఇలాతనూజన్ = భూపుత్రిని సీతను, వడిన్ = శీఘ్రముగా, కొనిపోవఁగ = కొనిపోవుచుండఁగ, అసహాయత = సాహాయ్యము ఏమాత్రములేక అనఁగా ఒంటరిగా, అడ్డమయిన, రామ + నరేంద్ర + కార్య + దత్త + ఆయువు = రామనృపాలుని పనికొఱకు సమర్పింపఁబడిన ప్రాణములు గలవాఁడును; పక్ష + వేగ + పరిహాసిత + వాయువు = ఱెక్కలయొక్క వేగముచేత తిరస్కరింపఁబడిన వాయువు కలవాఁడును — అనఁగా వాయువేగమునకంటె నెక్కుడు వేగముగల గమనము గలవాఁడును, అగు, ఆజటాయువును, ఘోర = భయంకరమైనట్టియు, ఆయత = నిడుపైనట్టియు. హేతిన్ = ఆయుధము చేత, త్రుంచెన్ = ఖండించెను.



తా. రావణుఁడు సీతను నిర్దయుఁడై న్యాయభయములేక కొనిపోవుచుండ జటాయువు ఒంటరిగా నెదురొడ్డెను. రావణుఁ డాతనిని ఓడించి యతని ప్రాణములఁ గొనెను.

వి. అం. ఈపద్యమునఁ గొంచె మన్వయకాఠిన్యముగలదు. ఈమాత్రము కాఠిన్యమునుగూడ సాధారణముగఁ బోతనామాత్యుని కవిత్వ మునఁగానరాదు. చదువరులు దీనిం గమనింతురుగాక.

అన్యాయముచేసి నిష్కరుణుఁడై యను పదముల ప్రయోగము వలన సీతాదేవి ఏంతశోకాలాపంబులుచేసినను రావణుఁడు దుశ్చింతలుగలవాఁడు గాన వాని మనస్సు కరుగదయ్యె ననుట సూచితము.

కథ. జటాయువు అనూరుని రెండవపుత్రుఁడు. ఇతని తాత కశ్యపుఁడు. అవ్వవినత. పినతండ్రిగరుత్మంతుఁడు. హనుమంతునకు లంకకు మార్గమును జెప్పిన సంపాతి జటాయువునకు అన్న.

వ. అంత నారామచంద్రుండు లక్ష్మణ సహితుండయి సీత వెదక
నరుదెంచి నిజకార్య నిహతుండైన జటాయువునకుఁ బర
లోకక్రియలు గావించి ఋశ్యమూకంబునకుం జని. ౧౮

టీ. నిజకార్య=తనపనియందు, నిహతుండైన=ప్రాణములు విడిచిన, తక్కుంగలది సుగమము.

వి. అం. ఋశ్యమూకముపూర్వపుఁబంపానది ప్రాంతమున, అనఁగా ఇప్పటి బళ్లారిజిల్లాలో నిప్పుడు సుప్రసిద్ధము లయిన హంపి, ఆనెగొంది యను స్థలములచేరువ నుండు ఒకపర్వతము. ఈహంపిరో పూర్వపుఁ గిష్కింధము అచ్చటి రాజయిన సుగ్రీవుఁడు దన యన్నయగు వాలికి జడిసి శాపకారణమున నతనికిఁ జేరరాని ఈఋశ్యమూకపర్వతమున డాగుకొని యుండెను.

క. నిగ్రహము వలదునీ కిఁక[1]
నగ్రజువాలిన్ వధింతు[2]నని నియమముతో
నగ్రేసరు గా నేలెను
సుగ్రీవున్ జరణఘాత చూర్ణగ్రావున్. ౧౯

టీ. నిగ్రహము=చెఱ, వలదు, నీకు,ఇఁక, అగ్రజున్=(మొదటపుట్టినవాని) అన్నను, వాలిని, వధింతు = చంపుదును, అని, నియమముతో = ప్రతిజ్ఞతో, చరణ + ఘాత + చూర్ణ + గ్రావున్ = పాదముల దెబ్బచేత పొడిగఁగొట్టఁబడిన కొండలు గలవాఁడు, అగు, సుగ్రీవుని, అగ్రేసరుగా = మొదఁటివాఁడుగా, అనఁగాఁ గిష్కింధకురాజుగ, ఏలెను=పరిగ్రహించెను.

తా. " ఇంకముందు నీకు నిర్బంధమువలదు. నీయన్నయగు వాలిని వధించెదను" అని ప్రతిజ్ఞచేసి రాముఁడు సుగ్రీవునకు రాజ్యమును సంపాదించి యిచ్చెను.

---

1. 'నిగ్రహము నీకువలదిఁక' యనిసాధారణపాఠము, ఈపాఠమునకును మాపాఠమునకును విశేషభేదము లేదు. కాని ఇట సుగ్రీవునినిగ్రహస్థితినిబోఁ గొట్టుటయే ముఖ్యాంశముగావున 'నిగ్రహమువలదు నీకిఁక' యనుటయె సమంజసము.

2. 'జయింతు'ననియు పాఠము గానచ్చుచున్నది.



(ఇది ఎట్లనుట ముందుపద్యమునఁ జెప్పుచున్నాఁడు)

క. లీలన్ రామ విభుం డొక
కోలన్ గూలంగ నేసె గురునయశాలిన్
శీలిన్ సేవితశూలిన్
మాలిన్ వాలిన్ దశాస్యమానోన్మాలిన్. ౨౦

టీ. గురు = గొప్ప, నయశాలిన్=నేర్పుగలవానిని, శీలిన్=మంచి యాచారము గలవానిని, సేవితశూలిన్ = పూజింపఁబడినశివుఁడు గలవానిని, మాలిన్ = (రుద్రాక్షు) మాలధరించిన వానిని, దశాస్య=రావణుని,మాన= దురభిమానమును, ఉన్మాలిన్=పెఱికివైచినవానిని, వాలిని, రామవిభుండు, లీలన్ = సునాయాసముగ, ఒకకోలన్ = ఒక్కబాణముచేత, కూలంగనేసెను = పడఁగొట్టెను.

తా. రాముఁడు మహాబలశాలియగువాలిని జంపెననియర్థము.

వి. అం. ఈపద్యము తఱచుగ మనవారెల్లరును జెప్పుచుందురు కాని ఇందావంతయయినను ఔచిత్యముగానరాదు. పోతనకుంగల విశృంఖలానుప్రాసధోరణి యిట మితిమీరి యర్థౌచిత్యమురవ్వంతయేనియుఁలేకుండ జేసినది. రాముఁడు తాళవృక్షములవెనుక దాఁగి [illegible] బాణమును





'శీలిన్' వేయఁబడినదని వర్ణించుట విపరీతముగఁ దోఁచుచున్నది. ఈసందర్భమున వాలిని 'శీలిన్' అనివర్ణించుటయు సమంజసముని తోఁపదయ్యె. ఇఁక 'మాలిన్' అనువిశేషణమువలన ప్రయోజనము మృగ్యము. విటిచియర్థముచేసి నన్ దప్ప అనుచితంబును గూడనయ్యెడి. ఏలయన, వాలిసుగ్రీవుల ప్రథమ యుద్ధమున శ్రీరాముఁడు వారిరువురొక్క పోలికనయుండుటంజేసి సుగ్రీవుని గుర్తింపఁ జాలనందున ద్వితీయ యుద్ధమునకు వెడలునెడ లక్ష్మణుఁడు రామునాజ్ఞ సుగ్రీవునకు హారమువైచిపంపెను. కావుననిట వాలిని 'మాలిన్' యనుట యనుచిత మగుచున్నది.

కథ. వాలిసుగ్రీవులు కిష్కింధరాజగు ఋక్షరజుని కుమారులు. వాలి రాజుగను సుగ్రీవుఁడు యువరాజుగను రాజ్యమేలుచుండిరి. ఆసమయమున వాలియొక్క ప్రతాపాతిశయమునువిని రావణుఁడు అతనితో యుద్ధము చేయఁగోరి కిష్కింధకువచ్చెను. వాలి అప్పుడు దక్షిణసముద్రమునకు స్నానముసేయఁబోయి యుండెను. అంతరావణుఁ డాతనిని వెదకుచుఁబోయి దక్షిణసముద్రతీరమున సంధ్యావందనంబు సలుపుచుండు వాలిని గాంచెను. కాంచి యాతనికిఁ దెలియకుండ వెనుకటివైపునుండి పట్టుకొన గమకించెను. దీనింగని పట్టి వాలి రావణుఁడు తనసందిటచేతులు దూర్చువఱకు మిన్నకుండి యటుపై ఆచేతుల నట్టె నదిమిపట్టెను. ఇట్లుపట్టుకొని నాలుగు సముద్రములలో ముంచి కిష్కింధకుఁగొనివచ్చి ఏమియుండెలియనివానివలె రావణుని నిజవృత్తాంతము చెప్పుమనియె. అంతవాఁడు లజ్జితుఁడై స్నేహముగోరివచ్చితి నని తెలిపి యొకమాసము వాలితోడనుండి బయలుదేరి పోయెను.

దీనికిఁ దరువాతఁ గొంతకాలమునకు వాలికిని దుందుభియను రాక్షసునకును బోరుగల్గెను. దుందుభిమరణమందెను. వాని కళేబరము విసరుటలో రుధిరము ఋశ్యమూకమున తపశ్చరణంబున నుండిన మతంగ మునీశ్వరునిపైఁబడి



తాయెను. అతఁడంత వాలి యానగంబునెక్కిన మృతుం డగుఁ గాకయని శాపంబిడియె. దీనికిఁ గొంతకాలము పిదప దుందుభి కుమారుఁడు మాయావి వాలితోడం బోరుసల్పవచ్చె. వాలి సుగ్రీవు లిద్దఱును గవయుటఁజేసి వాఁడుపాఱి యొకగుహఁ జొచ్చెను. అప్పుడు వాలి సుగ్రీవుని గుహాముఖంబున నునిచి రాక్షసుని వెంటనంటె. ఎంతకాలమునకును వాలిరాకుండుటంజేసియు రాక్షసుల కోలాహలము వినవచ్చుటంబట్టియు గుహ రుధిరపూరిత మగుటంబట్టియు వాలి హతుఁడయ్యెనని సుగ్రీవుఁడు తలంచి శత్రువులు తన్నెక్కడ వెన్నాడుదురోయని వెఱచి గుహాముఖమును శిలచేమూసి కిష్కింధకు వచ్చిచేరెను. వాలి మృతుఁడయ్యెనని సచివులు సుగ్రీవునికిఁ బట్టము గట్టిరి. కొలఁది కాలములోనే వాలివచ్చి సుగ్రీవుఁడెంత విన్నవించుకొనినను తెలిసికొనక కోపోద్దీపితుఁడయి అతనిభార్య నపహరించి అతనిని వీడు వెడలనడచెను. సుగ్రీవుఁడు అన్నకు వెఱచి అతనికిఁ జేరరాని ఆఋశ్యశృంగమున వచ్చి నివసించుచుండెను.

క. ఇలమీఁద సీతవెదకఁగ
నలఘుఁడు రాఘవుఁడువనిచె హనుమంతు నతి 1
చ్ఛలవంతున్ మతిమంతున్
బలవంతున్ శౌర్యవంతుఁ బ్రాభవవంతున్, ౧౭

టీ. ఇలమీఁద=భూమిపైని. సీతను, వెదకఁగ, అతిచ్ఛలవంతున్ = మిక్కిలి యుపాయము గలవానిని, మతిమంతున్ = బుద్ధిమంతుని, బలవంతున్ =బలముగలవానిని, శౌర్యవంతున్ = వీరుని, ప్రాభవవంతున్ = ఎల్లరకంటె నెక్కుడైనవానిని, హనుమంతుని, అలఘుఁడు =గొప్పవాఁడగు, రాఘవుఁడు=రాముఁడు, పనిచెను.

1. ఆహనుమంతున్ ఛలవంతున్. అని పా. అం.

తా. సీతను వెదకు పనికై శ్రీరాముఁడు ఉపాయశాలియు బుద్ధిమంతుఁడును బలవంతుఁడును శౌర్యవంతుఁడును అందఱను మించి పరాక్రమముగలవాఁడును నగు హనుమంతుని పంపెనని యర్థము.

వి. అ॥. ఈ పద్యమున ననుప్రాసాలంకారమే కవియుద్దేశముగఁ గన్పించుచున్నది. ఇచ్చట మహాకార్యసాధనకు వలసినగుణములు హనుమద్గుణవర్ణనవ్యాజమున వర్ణితములు.

క. అలవాటు కలిమి మారుతి
లలితామిత లాఘవమున లంఘించెను శై
వలినీగణ సంబంధిన్
జలపూరిత ధరణిగగన సంధిన్ గంధిన్. ౧౮

టీ. అలవాటు = అభ్యాసము, కలిమి = కలవాఁడగుటచే, మారుతి = హనుమంతుఁడు, శైవలినీ = నదులయొక్క, గణ = సమూహముయొక్క, సంబంధిన్ = కూడికకలదాని, జల + పూరిత + ధరణి + గగన + సంధిన్ = నీటిచేత నింపఁబడినభూమియొక్కయు ఆకాశముయొక్కయు కలయిక గలదానిని, అనఁగా భూమ్యాకాశముల మధ్యభాగమగు స్థలమును నీటితుంపురులచే నించుగుణముకలదానిని, కంధిన్ = సముద్రమును, లలిత = సొంపైనట్టియు, అమిత = మిక్కిలియైనట్టియు, లాఘవమున = చులకనచేత, లంఘించెను = దాఁటెను.

తా. అభ్యాసము కలవాఁడయినందున ఆంజనేయుఁడు సముద్రమును అవలీలగ దాఁటెను.

వ్యు. అ. మారుతి; మరుత్ అనఁగా వాయువు. వాయువుకుమారుఁడు గాన మారుతి.

శైవలినీ. శైవలమనఁగా నాచు. అది కలది గా నదికి శైవలినీ.



కంధి. కం అనఁగానీరు, దానిని ధరించునది గాన కంధి.

వ్యా. అలవాటుకలిమి ఇది అచ్ఛికసమాసము అనఁగా శుద్ధమయిన తెలుఁగుపదముల కూడిక. అలవాటుయొక్క కలిమిచేత యని విగ్రహము.

వ. అట్లు సముద్రంబుదాఁట సీతంగని హనుమంతుండు దిరిగి చనుదెంచుచు నక్షకుమారాదుల వధియించి. ౧౯

టీ. అక్షకుమారాదుల = అక్షకుమారుఁడు మొదలయినవారిని, వధియించి = చంపి.

తా. సుగమము.

క. సముదగ్రత ననిలసుతుం
డమరాహితదత్తవాలహస్తాగ్నుల[1] భ
స్మముసేసె నిరాతంకన్
సమదాసురసుభటవిగతశంకన్ లంకన్. ౨౦

టీ. అనిలసుతుండు = వాయుపుత్రుఁడు అనఁగా హనుమంతుఁడు, అమరాహిత = దేవతలకు శత్రువగు రావణునిచేత, దత్త = ఇయ్యఁబడిన, వాల + హస్త + అగ్నుల = తోఁకయనెడుచేతియందలిమంటలచేత, సమద = మదముతోఁగూడుకొనిన, అనఁగా మదించిన, అసుర = రాక్షస, భట = భటులచేత, విగత

1, " పాశఃపక్షశ్చహస్తశ్చ కలాపార్థఃకచాత్పరే " అని యమరసింహుఁడు కవచశబ్దపరమైన హస్తమునకు సమూహార్థము చెప్పియున్నాఁడు కావున వాలశబ్దముచే వాలము కొనయందలి కేశములని యర్థముచేసి అట్టికేశముల సమూహమని హస్తశబ్దమున కర్థమిచ్చినచో నింకను సరసముగ నుండునని తోఁచెడిని.

పోఁగొట్టఁబడిన, శంకన్ = భయముగలదానిని; నిరాంతకన్ = బాధలేనిదానిని, లంకను, భస్మముచేసెను = బూడిదచేసెను అనఁగా కాల్చెను.

తా. రావణుఁడు ఆంజనేయునివాలమునకు అగ్నిముట్టింప నాతఁడా యగ్ని సాహాయ్యంబుననే లంకాదహనమొనర్చెను.

కథ. పై మూఁడుపద్యములయందును రామాయణ కథయందలి కొంత భాగము మిక్కిలి సంక్షిప్తముగా వర్ణింపబడినది. శ్రీరాముఁడు కిష్కింధా నగరమున వాలినిజంపి సుగ్రీవునకుఁ బట్టముగట్టి కపివీరుల సాహాయ్యంబుగోరి అందనేకులను సీతాన్వేషణార్థము అనిపెను. వారిలో హనుమదాదులు దక్షిణపు దిక్కునకుం జనిరి. వెదకి వెదకి సీతనుగానక వీరు మిక్కిలివగచి ప్రాయోపవిష్టులయిరి. వారినిజూచి జటాయువుసోదరుఁడగు సంపాతి వారివృత్తాంతం బడిగి యరసికొని వారికి సీతాదేవి లంకయందుండుట నెఱింగించెను. అంతట కపులలో నిఁకెవ్వరును సముద్రమును లంఘింపశక్తిగలవారు గాకుండుట హనుమంతుండు కడలినిదాఁటి లంకకుఁ జొచ్చి సీతనువెదకి యశోకవనంబున నామెను గాంచెను. రాముని సేమంబుచెప్పి యానవాలగు నుంగరమునిచ్చి శిరోమణి నామెనుండి యానవాలుగఁగొని తిరిగి పోవుచుఁ దనప్రతాపంబు గొంచెము చూపువాఁడై అశోకవనభంగంబు కావించె. అదివిని రావణుఁడు జంబుమాలిని ఏడుగురు మంత్రిపుత్రులనుఐదుగురుసేనానాయకులను దరువాత నక్షకుమారుని బంపెను. వీరందఱును హనుమంతునిచే నిహతులయిరి. అంతట తండ్రి యనుజ్ఞను ఇంద్రజిత్తు అతని నెదిర్చి కడుంగడుపోరి బ్రహ్మాస్త్రంబు నంగూడ బద్ధుఁడు గాకుండుట కచ్చెరువందుచు నేదోయొక విధంబున నతనిని గట్టించి రావణుని మ్రోలకుఁ గొనితెచ్చె. అప్పుడు రావణుఁడు ఆంజనేయునిఁజంప సమకట్టెను గాని విభీషణుని ధర్మోపదేశమున వాయుపుత్రుని వాలంబునకు నగ్నిముట్టించి పురమంతయుఁ గలయఁ ద్రిప్పి పుచ్చుఁడని రాక్షసుల కుత్తరు విచ్చెను. ఆయుత్తరువును రాక్షసులు చెల్లించుచుండ హనుమంతుం డద్దానిని లెక్కసేయక తోఁకకునంటించిన ,జ్వాలలచేతనే లంకాపురిని భస్మముచేసెను.



వ. ఇట్లు లంకాదహనంబు సేసివచ్చి వాయుజుండు సీతాకథనం
బు సెప్పినవినిరామచంద్రుండు వనచరనాథయూథంబులుం
దానును జనిచని. ౨౧

టీ. ఇట్లు, లంకాదహనంబు = లంకనుగాల్చుటను, చేసి, వచ్చి, వాయుజుండు = వాయువు వలనఁ బుట్టినవాఁడు అనఁగా హనుమంతుండు, సీతాకథనంబు = సీతాదేవియొక్క వృత్తాంతము, చెప్పిన, విని, రామచంద్రుఁడు, వనచర + నాథ + యూథంబులున్ = కపులయొక్క రాజుయొక్క సైన్యములును, అనఁగా సుగ్రీవుని సేనలును, తానును, చనిచని = పోయిపోయి (కాంచెనను ముందు పద్యములోని సమాపక క్రియతో నన్వయము.)

వి. అః యూథశబ్దము మనుష్యేతర జంతువుల సమూహమునకుం జెందునది. ఇట వానరులును మనుష్యేతరులే గాన నీశబ్ద ప్రయోగము.

శా. ఆరాజేంద్రుఁడు గాంచె భూరివిధర
త్నాగారముం మీనకుం
భీరగ్రాహకఠోరముం విపులగం
భీరంబు నభ్రభ్రమ
ద్ఘోరాన్యోన్యవిభిన్న భంగభవని
ర్ఘోషచ్ఛటాంభఃకణ

ప్రారుద్ధాంబరపారముఁ లవణ
పారావారముఁ జేరువఁ. ౨౨

టీ. ఆరాజేంద్రుఁడు (రామచంద్రుఁడు), భూరివిధ= అనేకజాతులగు, రత్న=మణులకు, ఆగారముఁ=ఇల్లయినట్టిదియు, మీన=చేపలచేతను, క్షుంభీర=చొరచేఁపలచేతను, గ్రాహ = మొసళులచేతను, కఠోరముఁ = భీకరమయినట్టిదియు, విపుల = విస్తారమయిన, గంభీరముఁ = లోఁతుగల యట్టిదియు, అభ్రి = ఆకాశమున, భ్రిమత్ = తిరుగునట్టి, ఘోర + అన్యోన్య + విభిన్న = ఘోరముగా ఒండొంటిని విరగఁగొట్టుకొనునట్టి, భంగ ను అలలవలన, భవ=పుట్టిన, నిర్ఘోష=గొప్పధ్వనుల, ఛట = సమూహముచేతను, అంభఃకణ = నీటితుంపురులచేతను, ప్రారుద్ధ = ఆవరింపఁబడిన, అంబరపారముఁ=ఆకసమునంతయుఁ గలదియు (అనఁగా ఆకాశమునంతయు నించినదని యర్థము,) లవణపారావారముఁ=ఉప్పు సముద్రమును, చేరువఁ=దగ్గఱగ, గాంచె.

తా. ప్రయాణము చేసిచేసి శ్రీరాముఁడు అనేకజాతులరత్నములకును మీనములకును మొసళులకును ఒండొంటితో నొరసికొను గొప్పయలలకును ఉనికిపట్టగు సముద్రమును చేరెను.

వా. అన్యోన్యము అనునది 'అన్యః' 'అన్యం' అనువాని, కూడికవలన నయినది. సంస్కృతమున మొదటిది ప్రథమావిభక్తి. పరమందలిది ద్వితీయ. ఈపదఫీభాగము ఈపద్యమున సరిపోవుచున్నది. ఒకటి ఒకటిని విరగఁగొట్టుచున్నదని యర్థము. కొన్నియెడల ఈ ద్విరుక్తిలో పరమందుండు పదంబును బ్రథమమయి ప్రవర్తించెడి. ఒండొంటిఁ అనునదియు పూర్ణముగ నీవిధమగు నన్వయముగలది. ఒండు + ఒంటిఁ=ఒకటి ఒకటిని.



నిర్ఘోషచ్ఛట. సంస్కృతసమాసమున పరమగు పదాదిని ఛకారంబున్న నద్దానికి ద్విత్వంబగు.

వ్యు. పారావారము అనఁగా పారమును ఆవరించునది, (దరిని గప్పునదని యర్థము) అందువలన దరిలేనిదని ఫలితార్థము.

వి. అం. తీక్ష్ణముగ నలలు ఒండొంటిపై దుమికి చెల్లాచెదరై తుంపురులనింపి భయంకరమగు ధ్వని నీనుచుండుటను గమనించినవారెల్లరకును నీ పద్యమునందలి పదముల కూడిక చదువం జదువ నాకోలాహలస్వనంబు మఱిమఱి మనంబునకుఁ దెమ్చుచుండెడిని.

పైవచనమున (౨౧) రామచంద్రుఁడు చనిచని యని యసమాపకంబుగ వదలి ఈపద్యంబున ఆరాజేంద్రుఁడు గాంచెనని ప్రారంభించుట యన్వయదోషం బయి గన్పట్టుచున్నది. ఒకవేళ లేఖకులు ప్రమాదంబున 'రామచంద్రుఁడు' అని వచనమునఁ జొప్పించిరందమా! అప్పుడు ఆ రాంజేంద్రుఁడు అనుపదమునకు నూహచేసి రామచంద్రుఁడని యర్థముఁ జెప్పవలసి వచ్చునుగదా. పక్షాంతరంబున, పోతనామాత్యుఁడు పైవచనాంతమువఱకు వ్రాసి ఆఁపియుంచి మఱల ప్రారంభించుటలో రామచంద్రుఁడని ముందుఁజెప్పియుండుట మఱచి ఆరాజేంద్రుఁ డని వ్రాసి మఱల చూచుట కవకాశము చాలక యట్లైవదలె నందమా? ఎట్లైనను నొక్కటియ.

వ. కని తనకుఁ ద్రోవయిమ్మని వేఁడిన నదియుమార్గంబు సూపక
మిన్నందిన నారాచపట్టి రెట్టించిన కోపంబున. ౨౩

టీ. మిన్ను=ఆకాశము, అందిన, అనఁగా ఆకసముదాఁకునట్లు విజృంభించిన, రాచపట్టి=రాజకుమారుఁడు, రెట్టించిన = ఇనుమడించిన

క. మెల్లనినగవున నయనము
లల్లార్చి శరంబు విల్లు నందినమాత్రన్
గుల్లలు నాఁచులుఁ జిప్పలుఁ
బెల్లలునై జలధి పెద్ద బీడై యుండెన్. ౨౮

టీ. మెల్లని, నగవున, నయనములు = కన్నులు, అల్లార్చి = కదల్చి, శరంబు=బాణంబును, విల్లును=ధనుస్సును, అందిన=పొందిన, అనఁగా కొనిన మాత్రన్=మాత్రమున, జలధి=సముద్రము, గుల్లలు, నాఁచులు, చిప్పలు, పెల్లలును, అయి, పెద్దబీడు=గొడ్డునేల, అయి ఉండెన్.

తా. శ్రీరాముఁడు కోపమువలన ధనుస్సును బాణమును చిఱునవ్వుతోఁ జే పట్టునప్పటికి సముద్రపు నీరంతయు నింకిపోయి యడుగున నుండిన గుల్లలు నాఁచు, గప్ప చిప్పలు మున్నగునవి బయల్పడెను.

వ. ఇట్లు విపన్నుండగు సముద్రుండు నదులతో మూర్తిమంతుండయి చనుదెంచి రామచంద్రుని చరణంబులు శరణంబుగఁ జేసి యిట్లని స్తుతియించె. ౨౯

టీ. ఇట్లు, విపన్నుండు = విపత్తునందినవాఁడు, అగు సముద్రుండు, నదులతో, మూర్తిమంతుండయి=ఆకారమును కొని అనఁగా నిచ్చట మనుష్య రూపమును ధరించి యని, చనుదెంచి = వచ్చి, రామచంద్రుని, చరణంబులు= పాదములు, శరణంబు + కన్ = శరణంబులు (తనకు) అగునట్లు, చేసి, ఇట్లని స్తుతియించె.

వి. అం. నదులు స్త్రీలుగను సముద్రగాములగుట సముద్రునకు భార్యలుగను పరిగణింపఁ బడుచున్నవి. గృహస్థు భార్యా సమేతుఁడుగాక యెట్టి కర్మయు చేయంజనదు గాన సముద్రుఁడిట నదు లనుభార్యలతోడం గూడ వచ్చి ప్రార్థించినట్లు వర్ణన.



శా. ఓ కాకుత్థ్సకులేశ యో గుణనిధీ
యో దీనమందార నే
నీ కోపంబున కెంతవాఁడ జడుఁడన్
నీ వేమి భూరాజవే
లోకాధీశుఁడ వాదినాయకుఁడ వీ
లోకంబు లెల్లప్పుడున్
నీకుక్షిన్ బ్రభవించు నుండు నడఁగున్
నిక్కంబు సర్వాత్మకా. ౩౦

టీ. ఓ, కాకుత్థ్స + కుల + ఈశ = కాకుత్థ్సుని కులమునకు నాయకుఁడయినవాఁడా, ఓ, గుణ + నిధీ=మంచిగుణములకు పాఁతఱ వయినవాఁడా, అనఁగా మంచిగుణములు ఆతనిం దిమిడియుండె ననీ భావము, ఓ, దీన + మందార=దీనులకు కల్పవృక్షమయినవాఁడా, నే= నేను, నీకోపంబునకు ఎంతవాఁడ, అనగా నీ వాగ్రహించినయెడల నేనునిన్ను ఏమాత్రమును ఎదురింపఁజాలను అనిభావము, జడుఁడన్=మందబుద్ధిగలవాఁడను, (ఇట,జడశబ్ద ప్రయోగముచేత జలమును, అనియు అర్థము;) నీవు, భూరాజవే = భూరాజవా ఏమి (కాదనుట,) లోక + అధీశుఁడవు = ప్రపంచమునకు ప్రభువవు, ఆది=మొదటి, నాయకుఁడవు, ఎల్లప్పుడున్, ఈలోకంబులు, నీకుక్షిన్ = నీకడుపులోన, ప్రభవించు=పుట్టును, ఉండును, అడఁగున్= అణఁగిపోవును అనఁగా నశించిపోవును, నిక్కంబు=నిజము, సర్వాత్మకా=అందఱికిని ఆత్మయై పరగువాఁడా.

తా. కాకుత్థ్సకుల దీపకుఁడవును,సుగుణపుంజంబవయును దీనపోషకుఁడవును సర్వమునకును ఆత్మయైనవాఁడవునునగు(నోరామా!)నీవుసామాన్య

1 జడధిన్ అని పా. అం.

మగు రాజమాత్రుఁడవు గావు. లోకములకంతటికిని ప్రభుడవు. పురాణపురుషుఁడవు. విశ్వమంతయు నీయందు పుట్టి, వృద్ధిపొంది లయమగుచున్నది. ఇది నిజము. ఇట్టినిన్ను జలమాత్రింబనగు నాయట్టి మందబుద్ధి ఎప్పటికిని ధిక్కరింపఁ జాలఁడు.

వ్యా. 'నేనీకోపంబున' అనుచోఁ 'నే'. అనుపదము గమనించునది, నా' శబ్ద ప్రథమైకవచనంబగు 'నేను' అనుపదాంతమందలి ద్రుతమునకు 'నీ' యను స్థిరాక్షరంబు పరమగుటచే ఆ ద్రుతమునకు లోపము గల్గినది.

వి. అం. జడుఁడన్, భూరాజవే యను రెండుపదముల ప్రయోగముంజేసి శ్రీరాముఁడు సర్వంబునకు రాజగుటవలన జలమునకుంగూడ రాజనియు సముద్రుఁడు జడుఁడు, అనగా జలము అగుటచేత సముద్రుఁడు శ్రీరామునకు స్వభావముచేతనే వశుఁడనియు ధ్వని. భయగ్రస్తుఁడగు సముద్రుఁడు పలుకు వాక్యములు అట్టిస్థితియం దుండువాఁడు స్వాభావికముగ నుడువు వరుసనె విడివిడిగ పూర్వాపరని వేచన లేక ప్రయోగించుటవ్వాదయాక్షరకము.

కథ. పూర్వకాలమున ఇక్ష్వాకుకులమున విష్ణ్వంశసంభూతుఁడగు పురంజయుఁడను కోసలదేశాధిపతిగలఁడు. దేవాసురయుద్ధసమయమున నీతఁడు దేవతలచేఁ బ్రార్థితుండయి వృషభరూపమును ధరించుచుకొనిన ఇంద్రుని మూఁపురముపై కూర్చుండి ఈశ్వరుండో యన పోరుసలిపి సర్వరాక్షసకులంబు నిహతము చేసెను. మూఁపురమునకు సంస్కృతమున కకుత్ అని పేరు. దానిపై కూర్చొని సుప్రసిద్ధుఁ డగుటచే నీతనికి కకుత్ స్థుఁ డను పేరయ్యెను.

క. ధాతల రజమున దేవ
వ్రాతము సత్త్వమున భూతరాశిఁ దమమునన్
జాతులుగా నొనరించు గు
ణాతీతుఁడ వీవు గుణగణాలంకారా. ౨౭



టీ. ధాతలన్=బ్రహ్మలను అనఁగా సృష్టినొనరించు శక్తులను, రజమున = రజోగుణము వలనను, దేవవ్రాతము=దేవతలసమూహమును, అనఁగా స్థితికిఁ గారణభూతములగు శక్తులను, సత్త్వమున = సత్త్వగుణమువలనను, భూతరాశిన్ = జంతుసంఘమును అనఁగా లయమునకు పాలుపడినశక్తులను, తమమునన్ = తమోగుణమువలనను, జాతులు = పుట్టినవి, కాన్ = అగునట్లు, ఒనరించు = చేయు, గుణ + అతీతుఁడవు (పైమాఁడు) గుణములను అతిక్రమించినవాఁడవు, ఈవు=నీవు, గుణ + గణ + అలంకారా = సుగుణముల సమూహము అలంకారముగాఁ గలవాఁడా.

తా. రజోగుణముచేత బ్రహ్మలను, సత్త్వగుణముచేత దేవతలను, తమోగుణముచేత జంతుసంతతిని బుట్టించి ఆగుణంబుల నతిక్రమించిన వాఁడవయి సద్గుణములచేత నలంకరింపఁబడినవాఁడా.

వి. అం. 'గుణాతీతుఁడవు' 'గుణగణాలంకార' అను విశేషణంబుల యందు గుణశబ్దప్రయోగముఁ గమనించునది. మొదటి విశేషణము నందలిగుణ శబ్దము విశేషార్థముకలది. సృష్టిస్థితిలయములకు హేతుభూతంబులగు సత్త్వరజస్తమో గుణంబునకుఁ బరమాత్ముఁడు దూరుండని భావము. ఈత్రిగుణంబులు నిర్గుణుండైన ఈశ్వరునివలన ప్రభూతంబులు. పుట్టుక, బ్రతుకు, చావులకు మూలంబులయి కాలనిరోధంబులగు నీగుణంబులకు దూరుండేకాని ఈబంధములులేక సర్వకాలసమవర్తనంబులయి ప్రవర్తించు ప్రేమ, దయ, సూనృతము, తేజస్సు, బలము, శుచిత్వము, న్యాయము, మార్దవము, సౌందర్యము, మున్నగు ననంత కల్యాణగుణంబులకు నీశ్వరుఁడుదూరుఁడు గాఁడు. వీనిసంపూర్ణత్వమే యాతండు. వీనివలన నాతండు సగుణుఁడేకాని నిర్గుణుండు గాఁడు. ఇవియే నిర్గుణబ్రహ్మను సగుణబ్రహ్మనుగాఁ జేయునవి. వీనిచేతనే మన మతనిని అనంత కల్యాణగుణ పరిపూర్ణుఁడనఁ బ్రశంసింతుము. అట్టిగుణములను గాని

వాని సంపూర్ణత్వముంగాని మనశ్శక్తువుచే గ్రహింపఁజాలక కదా ఈశ్వరుని వర్ణనాతీతుఁ డందుము.

శ్రీరాముని మొదట త్రిగుణాతీతుఁ డనియుఁ దరువాత గుణగణాలంకారుఁ డనియు వర్ణించుటవలన ముందుపద్యమున వ్రాయఁబోవువిషయము లాతనికి నతిసులభ సాధ్యము లని సూచితము.

క. కట్టుము సేతువు లంకన్
జుట్టుము నీబాణశిఖల [1] సురవైరితలల్
గొట్టుము నేలంబడఁ జే
పట్టుము నీ యబల నధిక భాగ్యప్రబలన్ ౨౮

టీ. సేతువు=అడ్డకట్టను, కట్టుము, లంకన్, చుట్టుము అనఁగా ముట్టడింపుము, నీ, బాణ+శిఖల=అమ్ములయొక్క కొనలచేత, సురవైరి = దేవతలకు శత్రువగు రావణుని, తలల్, నేలన్+పడ=భూమి వ్రాలునట్లు,కొట్టుము=ఏయుము. నీయబలను=నీస్త్రీని అనఁగా భార్యను, అధిక+భాగ్య+ప్రబలన్=ఎక్కువయైన అదృష్టముయొక్క ప్రాబల్యము కలదానిని, చేపట్టుము=కైకొనుము.

తా. కట్టగట్టి సముద్రమును దాఁటి లంకను ముట్టడించి రావణుని జంపి సీతాదేవిని స్వీకరింపుము.

ఆ. హరికి మామ నగుదు నటమీఁద శ్రీదేవి
తండ్రి నూర కేల తాగడింపఁ

1 బాణవహ్నియని పాఠాంతరముగలదు. బాణవహ్నిచే లంకనుజుట్టుమని యర్థము చెప్పవలసి వచ్చును. కాని ఇట లంకను జుట్టుకొని రావణునితలలను ద్రుంచుటయె స్వభావసిద్ధ మగు నన్వయముగ నున్నది.



గట్టఁగట్టిదాఁటు కమలాప్తకులనాథ
నీ యశోలతలకు నెలవు గాఁగ. ౨౯

టీ. కమల+ఆప్త+కుల+నాథ = తామరలకుస్నేహితుఁడైన సూర్యుని వంశమునకు ఉద్ధారకుఁ డయినవాఁడా, హరికి = విష్ణువునకు, మామను, అగుదును, అటమీఁద = ఆపైగా, శ్రీదేవి=లక్ష్మీదేవియొక్క, తండ్రిన్, ఊరక, ఏల, తాగడింప=నిర్బంధింప, నీయొక్క, యశోలతలకు=కీర్తియొక్క తీఁగెలకు, నెలవు=స్థానము, కాఁగన్=అగునట్లు, కట్టన్, కట్టి, దాఁటుము.

తా. ఓరామచంద్రా నేను విష్ణువుమామను. లక్ష్మీదేవితండ్రిని. కాన నిర్బంధింపనేల? కట్టగట్టి దాఁటిపొమ్ము. కీర్తిం గనుము.

వి. అం. ఈపద్యమునందు భావము విశేషము గలదు. సముద్రుఁడు తాను విష్ణువునకుమామయనియు లక్ష్మికిఁదండ్రియనియుఁ జెప్పుకొనుటచేఁ దాను పరుఁడు గాఁడనియు రాముఁడువిష్ణ్వంశసంభూతుఁడును సీతాదేవిలక్ష్మీదేవి యంశమునఁ బుట్టినదియు నగుటవలన వారికి దగ్గరిచుట్టంబే యనియు గావున రాముఁడుదన్ను నిర్బంధించుటగాని తాను అతనికి నిర్బంధకారణమగుటగాని కూడదనియు స్ఫురింపఁజేయుచున్నాడు.నీయశోలతలకు నెలవు గాఁగఁ గట్టఁగట్టుమనుటలో కట్టయేమియు లేకయె మార్గమును దానొసఁగఁ దలఁచినను నయ్యది భావికాలమున నీ సముద్రతరణముయొక్క చిహ్నమును లేకుండంజేయును గానఁ దగదనిసూచన. ఈవాక్యము వ్రాయునెడ రామేశ్వరప్రాంతమునందుండు సేతుఖండము దప్పక కవికి మనోగోచరంబయి పొడకట్టుచుండెనని చదువరులకుఁ దట్టకమానదు.

వ. అని విన్నవించిన రామచంద్రుండు సముద్రునిఁ బూర్వప్రకారంబుననుండు పొమ్మని వీడుకొల్పె నంత. 30

టీ. విన్నవించిన=మనవిచేసికొనిన, వీడుకొల్పెను = సెలవొసంగి పంపెను. అంత; (ఈచిన్నపదముచే చెప్పుచున్న విషయమును ముగించిముందు కు కథను సాగించుచున్నాఁడు.)

క. ఘనశైలంబులుఁ దరువులు
ఘనజవమున బెఁటికి తెచ్చి కపికులనాథుల్
ఘన జలరాశిన్[1] గట్టిరి
ఘనవాహప్రముఖ దివిజగణము నుతింపన్. ౩౧

టీ. కపికులనాథుల్ = కపివంశమునందు ప్రముఖులైనవారు, ఘన= గొప్పవైన, శైలంబులున్ = పర్వతములును, తరువులు = చెట్లును, ఘన= మిక్కుటమైన, జవమునే = శీఘ్ర్యముచే, పెఱికి, తెచ్చి, ఘనవాహ + ప్రముఖ + దివిజ + గణము = (మేఘములను నడపువాఁడైన) ఇంద్రుఁడు మొదలుగాఁగల దేవతలసమూహము, నుతింపన్ పొగడునట్లు అనఁగా ప్రశం సించునట్లు, ఘన=మిక్కిలిలోతైన (అనఁగా గంభీరమై అడ్డకట్టవేయుటకు సాధారణముగ నలవికాని) జలరాశిం=(నీళ్లప్రోవును) సముద్రమును, కట్టిరి.

తా. వానరముఖ్యులు గొప్పపర్వతములను చెట్లను శీఘ్రగతినిఁ దెచ్చి సముద్రమున వైచి సేతువును గట్టిరి.

కథ. ఇట వానరముఖ్యులను నెడ మొదటఁ బేర్కొనం దగినవాఁడు దేవతలశిల్పి యగు విశ్వకర్మకుఁ బుత్రుఁ డగునలుఁడు. అతఁడు శిల్పిగ జాంబ వంతుఁడు, సుషేణుఁడు, నీలుఁడు, ఆంజనేయుఁడు మున్నగాఁ గలవారు సహాయులుగ సేతుబంధనంబు ముగిసె.

---

1. రసరాశిం గట్టిరి యని పా. అం



వ. ఇట్లు సముద్రంబు దాఁటి రామచంద్రుండు రావణుతమ్ముం డైన విభీషణుండు శరణంబు వేఁడిన నభయం బిచ్చికూడు కొని లంకకుఁ జని విడిసి వేడెపెట్టించి లగ్గలు పట్టించిన. ౩౨

టీ. శరణంబు = రక్షణ, అభయంబు + ఇచ్చి = ధైర్యమొసఁగి. విడి సి=దండుదిగి, వేడెపెట్టించి=పరివేష్టించి అనఁగా చుట్టుకొనునట్లు పన్ని, లగ్గలుపట్టించిన=కోటగోడను ప్రాకించిన అనఁగా కోటను స్వాధీనపఱచు కొనిన.

వి. అం. వైపద్యమునే ఈవచనమును అన్వయమునఁ గలుపు 'ఇట్లు' అనుపదమును గమనింపవలసి యున్నది. వైపద్యమునఁ గపికులనాథులు సేతు వునుగట్టుట వర్ణింపఁబడెను. ఈవచనమున రామచంద్రుండు కర్త. ఇట్లు అనఁగా ఈవిధముగా ననియే యర్థము చెప్పి తీరవలెను. ఈవిధముగా రామ చంద్రుండు సముద్రంబు దాఁటి యని అన్వయము. వైపద్యమునకును దీనికిని పూర్ణమయిన సంబంధము పదములలోఁ గానరాదు. భావములఁ గొని సంబం ధము కలుపుకొనవలెను.

అభయము అనుపదమున 'నీకు భయము లేదు' అనువాక్యముయొక్క అర్థము ఇమిడియున్నది. ఇట్లే 'స్వాగతంబును' వీనికి సరియైన పర్యాయ పదములు వ్రాయుట పొసఁగదు. కాని వీనిభావమాత్రము రాఁగలదు.

సీ. ప్రాకారములు ద్రవ్వి పరిఖలు పూడిచి
కోటకొమ్మలు నేలఁ గూలఁద్రోచి
వప్రంబు లగలించి వాకిళ్లు పెకలించి
తలుపులు విఱిచి యంత్రములు చెఱిచి

ఘనవిటంకంబులు ఖండించి పడవైచి
గోపురంబులు నేలఁ గూలదన్ని
మకరతోరణములు మహిఁ గూల్చి కేతనం
బులు సించి సోపానములు గదల్చి
గృహములెల్ల వ్రచ్చి గృహరాజములు గ్రొచ్చి
భర్మకుంభచయము పాఱవైచి
కరులు కొలను సొచ్చి కలఁచిన కైవడిఁ
గపులు లంకఁ జొచ్చి కలఁచి రపుడు. 33

టీ. కరులు=ఏనుఁగులు, కొలను=సరస్సు, చొచ్చి, కలఁచిన=కలయఁ బెట్టిన, కైవడి=విధముగా, కపులు, అప్పుడు, లంకన్, చొచ్చి, ప్రాకారములు=కోటయొక్క వెలుపటిగోడలు, త్రవ్వి, పరిఖలు=అగడ్తలు, పూడిచి అనఁగా మట్టిమొదలగునవి వైచి నించి, కోటకొమ్మలు=కోటబురుజులు, నేలన్, కూలన్, త్రోచి అనఁగా కోటయందలి యున్నతభాగములనుభూమికిఁ బడునట్లు త్రోసి, వప్రములు=కోటకొఱడులు (లోభాగపు గోడలు) అగలించి=పెకలించి, వాకిళ్లు, పెకలించి=పెఱికివైచి, తలుపులు, విఱిచి, యంత్రములు, చెఱిచి, ఘన=గొప్పవైన, విటంకములు=గృహముల పైభాగమందలి కలశములను, ఖండించి = ఛేదించి, పడవైచి, గోపురంబులు, నేలన్, కూలన్, తన్ని, మకరతోరణములను =మొసలి ఆకారములు చెక్కినబహిర్ద్వారములను, మహిన్=భూమిమీఁద, కూల్చి, కేతనంబులు=పతాకములు, చించి, సోపానములు=మెట్లు, కదల్చి, గృహములు=ఇండ్లు, ఎల్ల=అన్ని, వ్రచ్చి=బ్రద్దలుచేసి, గృహరాజములు=పెద్దయిండ్లు, గ్రొచ్చి=గుద్దలిలోనగువానితో త్రవ్వి, భర్మ+కుంభ+చయము = బంగారుకుండల సమూహమును, పాఱవైచి, కలచిరి=కలయఁబెట్టిరి.



తా. ఏనుగులుసరస్సునందుఁ జొరబడి వానినంతయు చిందరవందర చేయు విధముగా కపులు లోనికిదూరి ఒకచోట కోటిగోడలనుపడ వైచియు ఒకచోట అగడ్తలను పూడ్చియు, ఒకచోట తలుపులువిఱిచియు, ఒకచోట యంత్రములు పాడుచేసియు, ఒకచోట కలశములను రాల్చియు ఇంకను అనేకవిధముల లంకను చిందరవందర పఱచిరి.

వి- అం. యంత్రములు; ఎప్పుడును తనపనిని సులభముచేసికొనఁ బ్రయత్నించుట మానవుని స్వభావము. కావున ఎల్ల కాలములయందునుయంత్ర నిర్మాణము కొద్దిగనో గొప్పగనో జరుగుచునే వచ్చుచున్నది. కొండ ప్రక్కల రాళ్లలేవనెత్తు ఉప్పరవాఁడు పెద్దరాళ్లను మోసికొనివచ్చుట సాధ్యముగానందున ఱాడుగాటి గడ్డపారను తీసుకొని ఒకమొన పెద్దరాతిక్రిందికి దూర్చి ఆమొనకు చేరువనె పార రెండవవైపున మఱియొక చిన్నరాతిని పెట్టుకొని దానిపై పారబరువును బడనిచ్చి రెండవమొన వైపున తానుపట్టి నొక్కును. పెద్దరాయి లేచును. అప్పుడు గుండ్రమగు కఱ్ఱను ఆరాతిక్రిందికి ఉప్పరిదోపును. పైవిధముననే రాతిని మఱికొంత లేపి మఱియొకకఱ్ఱను దూర్చును. ఆకఱ్ఱల సాహాయ్యమున సులభముగా రాతిని తోసికొనిపోవును. ఇదంతయు యంత్రప్రభావమే. ఈయుప్పరవాని పార, రాయి, కఱ్ఱమొదలు నేఁడు చూడనగు సున్నితమయిన సూక్ష్మదర్శని వఱకుఁగల యుపకరణము లెల్లయును యంత్రములే.

పూర్వకాలమున కోటలలో యుద్ధమునకు వలసిన యంత్రము లుండెడివి. శత్రుపురములచుట్టు నుండు అగడ్తల నించుయంత్రములుకొన్ని, మోసముచేత పరసైన్యములను నాశముచేయుయంత్రములుకొన్ని. ఇట్టివిలంకయందనేకములు కలవు. వానిని కపులుచెఱిచిరని కవివర్ణించి యున్నాఁడు. శత్రువునకు సాధన సంపత్తిదఱిఁగిన బలమును దగ్గునుగాన నీవర్ణన.

పోతనామాత్యుఁడు సర్వసాధారణపదములచే తత్తానాయుద్ధమును చూచినట్లే వర్ణించియున్నాఁడు.

వ. అంత నయ్యసురేంద్రుండు పంచినఁ గుంభ, నికుంభ, ధూమ్రాక్ష, విరూపాక్ష, సురాంతక, నరాంతక, దుర్ముఖ, ప్రహస్త, మహాకాయ ప్రముఖు లగు దనుజవీరులు శర, శరాసన, తోమర, గదా, ఖడ్గ, శూల, భిండిపాల, పరశు, పట్టిస, ప్రాస, ముసలాది సాధనంబులు ధరియించి మాతంగ, తురంగ, స్యందన సందోహంబుతో బవరంబుసేయ సుగ్రీవ, పవనతనయ పనస, గజ, గవయ, గంధమాదన, నీలాంగద, కుముద, జాంబవ దాదు లారక్కసుల నెక్కటి కయ్యంబులందుఁ దరుల గిరులఁ గరాఘాతంబుల నుక్కడంచి త్రుంచి రంత. ౩౮

టీ. అంత=కపులీప్రకారము లంకను చిందరవందర చేయఁగా, అయ్యసురేంద్రుఁడు=ఆరాక్షసుల ఱేఁడు, పంచిన=ఆజ్ఞ ఇయ్యఁగా, ధూమ్రాక్ష విరూపాక్ష...మహాకాయ, ప్రముఖులగు=ముఖ్యులుగాఁగల అనఁగా వీరు మొదలైన, దనుజవీరులు=రాక్షసశూరులు, శర=బాణములును, శరాసన=ధనువులును, తోమర=చిల్లకోలలును, గదా=గదలును, ఖడ్గ=ఖడ్గములును, శూల=మూఁడు మొనలు గల ఆయుధములును (ఈశ్వరుని ఆయుధమునకు త్రిశూలమని ప్రసిద్ధమయిన పేరు) భిండిపాల=విడిచివాటుగుదియలును, పరశు=గండ్రగొడ్డళ్లును, పట్టిస=ఒకవిధమగు నీటెలును, ప్రాస=సాధారణమైన ఈటెలును, ముసల=రోఁకలిపోలిన ఆయుధవిశేషములును, ఆది=మొదలగు, సాధనంబులు=ఆయుధములు, ధరించి, మాతంగ=ఏనుగులయు.



తురంగ=గుఱ్ఱములయు, స్యందన=రథములయు, సందోహంబులతో=సమూహములతో (ఇవియుసహకారులుగా అనియర్థము), బవరంబు=యుద్ధము, చేయఁగా, సుగ్రీవ...నీల, అంగద,...జాంబవత్, ఆదులు=మొదలగువారు, ఆ, రక్కసులకు, ఎక్కటికయ్యంబులందు=ఒంటియుద్ధములందు (అనఁగా మఱియొకరి సాహాయ్యములేక ఒక్కనికి ఒక్కఁడుగ పోరుటయందు), తరుల=చెట్లచేతను, గిరుల=కొండలచేతను, కర+ఆఘాతంబుల=చేతిదెబ్బలచేతను, ఉక్కు=స్థైర్యమును అనఁగా నిలుకడను, లక్షణవలన బలమును అనిభావమైనది, అడంచి=నశింపఁజేసి, త్రుంచిరి=చంపిరి, అంత (ముందుకథ నడువనున్నదని సూచన.)

తా. సుగమము.

వ్యా. సంస్కృతంబున 'త్' కారమునకు నచ్చుపరంబగుచో 'ద' కారమాదేశమగు, తత్+అంగ=తదంగ, తత్+ఈశ=తదీశ మొదలైనవి.

వి. అం. ఎక్కటికయ్యములు పూర్వకాలముననన్ని దేశములయందును సాధారణములు. పాశ్చాత్యులు మతరక్షణార్థమును, స్త్రీలరక్షణార్థమును, ఇట్టి ద్వంద్వయుద్ధము లనేకములు సలుపుచుండిరి. వీని నాధారముచేసికొని అనేక కావ్యములును నవలలును రచింపంబడినవి.

క. ఆయెడ లక్ష్మణుఁడుజ్జ్వల
సాయకములఁ ద్రుంచె శైలసమకాయు సురా
జేయు ననర్గళమాయో
పాయుం గగుణవిధేయు నయ్యతికాయున్. ౩౯

టీ. ఆయెడ=ఆసమయమున, ఉత్+జ్వల=మిక్కిలి తేజోవంతము లయిన, సాయకములన్=బాణములచేత, శైలసమకాయు=కొండను బోలిన దేహముగలవానిని, సుర+అజేయు=దేవతలకుజయింపరానివానిని, అనర్గళ=

అడ్డులేని, మాయోపాయుఁ=ఒకరికిఁ దెలియరానివిధమున యుక్తులు పన్ను వానిని, నయగుణవిధేయు=మంచిగుణములకు లోనైనవానిని, ఆ+అతికాయుఁన్=(సుప్రసిద్ధుఁడైన) అతికాయుని, తుంచెన్=చంపెను.

తా. ఆసమయమున లక్ష్మణుఁడు తీక్ష్ణమైన అస్త్రముల నేసి మహాబలశాలియు నుపాయవంతుఁడునునగు అతికాయుని జంపెను.

వ్యా. ఉత్+జ్వల=ఉజ్జ్వల, తవర్గమునకు చర్గము పర మగునపుడు చవర్గమాదేశమగును. ఇచ్చట తవర్గగు 'త్' నకు చవర్గగు 'జ్' పరము కాగా 'త్' కుమారుగ 'జ్' వచ్చి జకారద్వయమయినది.(స్తోశ్చునాశ్చుః)

సుర+అజేయు=సురాజేయు, సవర్ణ దీర్ఘ సంధి.

ఆ+అతికాయున్,అయ్యతికాయున్ పరమగు పదము హ్రస్వాది యయ్యేనేని ఆ, ఈయను నిర్దేశపదములదీర్ఘంబునకు హ్రస్వంబును పరమగు పదాదియందలిహల్లునకుద్విత్వంబును(యడాగమంబయినను హల్లేయగునుగదా) బహుళంబుగ నగు.

వి. అం. 'మాయోపాయున్' 'నయగుణ విధేయున్' అనుటలో పూర్వసరవిరోధము గలదా? లేదులేదు. ఇట 'మాయోపాయుఁ'డన యుద్ధమునందు విశేష కౌశలముగలవాఁడని మాత్ర మర్థము. శాంబరీవిద్య గఱచిన వాఁడనిభావము. భ్రమపడి దీనివలన నతికాయుఁడు గుణహీనుండందు రేమో యను శఁకపున కవి నయగుణవిధేయుఁడని సహజసౌశీల్యమును వర్ణించియున్నాఁడు. యుద్ధభూమియందలి ప్రవర్తనకు సాధారణ జీవయాత్రా సందర్భమునందలి ప్రవర్తనకును మిక్కిలియంతరము గలదు గదా!

ఆ రామచంద్రవిభుఁడు రణమున ఖండించె
మేటికడిమి నీలమేఘవర్ణు
బాహుశక్తిపూర్ణు పటుసింహనాదసం
కుచిత దిగిభకర్ణుఁ గుంభకర్ణు. ౩౬

టీ. మేటి=అధికమయిన, కడిమిన్=పరితాపముచేత, రామచంద్ర విభుఁడు, నీలమేఘవర్ణు=నల్లనిమబ్బురంగుగలవానిని, బాహుశక్తిపూర్ణు=భుజములయొక్క బలముచే నిండినవాని, పటు=అధికమైన, సింహనాద=బొబ్బరింతచేత, సంకుచిత=ముకుళింపఁబడిన అనఁగా మూసికొనిపోయిన, దిక్+ఇభ=దిగ్గజములయొక్క, కర్ణు=చెవులుగలవానిని (అనఁగా నితనిబొబ్బరింతలచేత అష్టదిక్కులయందుండు ఏనుఁగులకు చెవుడుపట్టుచుండెనని యర్థము.) కుంభకర్ణుని, రణమున=యుద్ధమునందు, ఖండించెను=చంపెను.

తా. శ్రీరాముఁడు మహాబలశాలియగు కుంభకర్ణుని చంపెను.

క. అలవున లక్ష్మణుఁ డాజి
స్థలిఁ గూల్చెన్ మేఘనాదుఁ జటులాహ్లాదున్
బలభేది జయవినోదున్
బలజనిత సుపర్వసుభట భావవిషాదున్. ౩౭

టీ. లక్ష్మణుఁడు, ఆజిస్థలిన్=యుద్ధభూమియందు, చటుల=మిక్కిలి, ఆహ్లాదున్=వికాసముగలవానిని, బలభేది=ఇంద్రుని, జయ=జయించుటయందు, వినోదున్=వేడుకగలవానిని, బల=బలముచేత, జనిత=పుట్టిన, సుపర్వ=దేవతలయొక్క, సుభట=మంచిభటులయొక్క, భావ=తలఁపులయొక్క, విషాదున్=ఖేదముగలవానిని అనఁగా తనబలముచేత దేవతలలోనియుద్ధభటులకు వికలత్వముఁ బుట్టించువానిని, మేఘనాదున్=ఇంద్రజిత్తును, అలవున=పరిశ్రమచేత, కూల్చెన్=చంపెను.

తా. మిక్కిలి విశ్వాసవంతుఁడును ఇంద్రుని జయించినవాఁడును లోకులకు దుఃఖమును గలిగించువాఁడును నయిన యింద్రజిత్తును లక్ష్మణుఁడు తునుమాడెను.

కథ. మేఘనాదుఁడు. ఇది ఇంద్రజిత్తుయొక్క మూలనామము. ఇతఁడు లంకాధిపతి యగు రావణునకును మందోదరికిని జన్మించినవాఁడు. పుట్టినప్పుడె మేఘగర్జనముం బోలుశబ్దము వెల్వడినందున ఇతనికి మేఘనాదుఁడను పేరిడిరి. వయస్సువచ్చి పెద్దవాఁడైనపిదప శుక్రాచార్యుల సాహాయ్యంబున నితఁడు యజ్ఞములుచేసి శివప్రసాదమున రథము, శస్త్రములు, మాయాశక్తి మున్నగువానిని పడసెను. కాని రావణుఁడు దేవద్వేషియయి దేవతలకు హవిర్భాగముల నియ్యనిష్టపడనివాఁడైనందున మేఘనాదుఁడు యజ్ఞాదుల నింకను విశేషముగ చేయనివాఁడయ్యె.

రావణుఁడు దిగ్విజయార్థము దేవతానగరిపై దండెత్తిపోయెను. ఇంద్రుని సైన్యమును రాక్షసులును ఘోరముగఁ బోరిరి. రావణునిమాతామహుఁడు సుమాలి మడిసె. రాక్షసులు ఓడిపోవునట్లుండె. అప్పుడు మేఘనాదుండు ముందుపడి ఇంద్రునిబంధించిలంకకుఁగొని తెచ్చెను. బ్రహ్మప్రత్యక్షుఁడయి కొన్ని వరములొసఁగినపిదప నింద్రుని విడిచిపుచ్చెను. ఈవిజయమువలననే మేఘనాదునకు నింద్రజిత్తనుపేరు గలిగె. ఇట్టి ఇంద్రజిత్తును రామాయణయుద్ధమున విభీషణుని సాహాయ్యంబున లక్ష్మణుఁడు త్రుంచెను.

బలభేది బలుఁడనురాక్షసుఁ జంపినవాఁడుగావున ఇంద్రునకీపేరు. బలుఁడువృత్రాసునిసోదరుఁడు. కశ్యపునిపదుమువ్వురుభార్యలలోని 'దనాయు' వను స్త్రీపుత్రుఁడు.

వ. అంత. ౩౮



క. తనవారందఱు ద్రుగ్గిన
ననిమిషపరిపంథి [1] పుష్పకారూఢుండై
యనికి నడచి రామునితో
ఘనరౌద్రముతోడ నంపకయ్యము సేసెన్. ౩౯

టీ. తనవారు, అందఱు, ద్రుగ్గిన=చచ్చిన, అనిమిష=(రెప్ప వేయనివారయిన) దేవతలకు, పరిపంథి=శత్రువు, అనఁగా రావణుఁడు, పుష్పకారూఢుండయి=పుష్పకమనువిమానమును ఎక్కికూర్చుండి, అనికి = యుద్ధమునకు, నడచి, రామునితో, ఘనరౌద్రముతో=ఎక్కుడైన రోషముతో, అంపకయ్యము=బాణయుద్ధము (అమ్ములతో పోరుట), చేసెన్.

తా. బంధుమిత్రాదులెల్లరు చచ్చుటచే మండిపడి ఆరోషమున పుష్పకమునెక్కి యుద్ధమున శ్రీరాము నెదిర్చి రావణుఁడు పోరుసలిపెను.

కథ. పుష్పకము. ఇది స్వేచ్ఛగామియగు విమానము. బ్రహ్మనుగూర్చి తపస్సుచేసి కుబేరుఁడు దీనిని సంపాదించుకొని యుండెను. రావణుఁడాతనిని ఓడించి దీని నపహరించియుండెను. రావణవధానంతర మిది రామునివశమయ్యె.

వ. అయ్యవసరంబున. ౪౦

టీ. అవసరము = సమయము.

---

1. సాధారణపాఠము 'అనిమిషపతివైరి.' విష్ణువు 'సురప్రార్థితుండై' రామావతారం బెత్తెననికథ. కావున నొక్కసురపతిమాత్రమునకు రావణుఁడు వైరి యని ఇట వర్ణించుటకంటె సురలెల్లరకు వైరియని వర్ణించుటయె సమంజసము.

క. సురపతిపంపున మాతలి
గురుతరమగు దివ్యరథము గొనివచ్చిన నా
ధరణీవల్లభుఁ డెక్కెను
ఖరకరుఁ డుదయాద్రి నెక్కు కైవడి దోఁపన్. ౪౧

టీ. సురపతిపంపున=దేవతల ఱేఁడయిన ఇంద్రునియాజ్ఞచేత, మాతలి=ఇంద్రుని సారథి, గురుతరమగు=మిక్కిలి గొప్పదియగు, దివ్య=దేవతలకుసంబంధించిన, రథమును, కొనివచ్చిన, ఆధరణీవల్లభుఁడు=రామచంద్రుఁడనియర్థము, ఖరకరుఁడు = తీక్ష్ణమైనకిరణములుగలవాఁడు సూర్యుఁడు, ఉదయాద్రిన్ = పొడుపుకొండను, ఎక్కు, కైవడి=విధము, తోఁపన్=తలంపునకు వచ్చునట్లు ఎక్కెను.

తా. దేవేంద్రుఁ డాజ్ఞాపింప నతనిసారథియగు మాతలి గొప్పదైనదివ్యరథమొక దానిని దెచ్చెను, తేజోవంతుఁడగు సూర్యుఁడు తూర్పుకొండ నెక్కెడుగున శ్రీరాముఁడు ఆరథమును అధిరోహించెను.

త్మా. దేవేంద్రుఁడు కొంతయుద్ధమును పాదచారియయియే చేసెను. పలుప దేవతలకొఱకు పోరుచుండినశ్రీరాములయందుఁ గృతజ్ఞత గలవాఁడయి ఇంద్రుఁడు రథముం బంపెను.

వ. ఇట్లు దివ్యరథారూఢుం డయి రామచంద్రుండు రావణున కిట్లనియె, ౪౨

టీ. సుగమము.

మ. చపలత్వంబున డాఁగి హేమమృగముల్
సంప్రీతిఁ బుత్తెంచుటో?
కపట బ్రాహ్మణ మూర్తివై యబల నా
కాంతారమధ్యంబునం
దపలాపించుటయో? మదీయశితది
వ్యామోఘబాణాగ్ని సం
తపనం బేగతి నోర్చువాఁడవు ? దురం
తం బెంతయున్ రావణా. ౪౩



టీ. రావణా, చపలత్వంబున=(రాగద్వేషములచేనైన) తబ్బిబ్బువలన, డాఁగి=దాఁగుకొని, సంప్రీతిన్=పూర్ణమైన ఇచ్ఛతో, హేమమృగముల్=బంగారుజింకను, పుత్తెంచుటో=పంపుటయా? (కాదనుట), కపటబ్రాహ్మణమూర్తివై = కృత్రిమబ్రాహ్మణాకారము కొనినవాఁడవై, ఆకాంతారమధ్యంబునందు=ఆ(దండక) అరణ్యపునడిమి ప్రదేశమున, అబలన్ = బలములేనిస్త్రీని, అపలాపించుటయో = దాఁచుటయా? అనఁగా దొంగలించుటయా? (కాదనుట,) మదీయ=నాయొక్క. శిత=తీక్ష్ణమైనట్టియు, దివ్య = దేవతాసంబంధమయినట్టియు, అమోఘ=వ్యర్థకానట్టియు, బాణాగ్ని= బాణములయగ్నియొక్క, సంతపనంబు=మిక్కుటమగుతాపము, ఎంతయున్, దురంతంబు=మితిమీరినది! ఏగతి=ఏవిధముగా, ఓర్చువాఁడవు = భరింపఁగలవు? (భరింపలేవని.)

తా. రాగద్వేషములవలన తబ్బిబ్బుపడి పనియగు ననుతలంపున నీవు దాఁగుకొని కృత్రిమమృగమునుపంపుటసులభమే. దండకారణ్యమున కృత్రిమబ్రాహ్మణుండవయి సహజముగనే బలములేని స్త్రీమాత్రను అపహరించుటయు సులభంబె. తీక్ష్ణమయి వ్యర్థకాని నాదివ్యాస్త్రములదెబ్బకు నిలుచుటనీకసాధ్యముసుమా!

వి. అం. హేమ మృగము అని మృగశబ్దమును అబల యనుపదమును ఈపద్యమునందలి సారస్యమునకు మూలాధారములనుట చదువరు లిదివఱకే గ్రహించి యుందురు.

క. నీచేసిన పాపములకు
నీచాత్మక యముఁడు వలదు నేఁడిట నా నా
రాచములఁద్రుంచి వైచెద
ఖేచర భూచరులు గూడి క్రీడం జూడన్. ౪౪

టీ. నీచాత్మక=దుష్టబుద్ధిగలవాఁడా, నీ=నీవు, చేసిన, పాపములకు, యముఁడు అనఁగా నిట సహజమగు మరణమని యర్థము, వలదు, ఖేచర=ఆకాశమున తిరుగువారు దేవతలు, భూచరులు = భూమిమీఁదఁ దిరుగువారు నరులు, కూడి=కూడుకొని, క్రీడన్=సంతోషముచేత, చూడన్ = చూచుచుండఁగా, నేఁడు = ఈదినము, నా నారాచములన్ = నాబాణములచేత, త్రుంచివైచెద=చంపివేసెదను.

తా. దుర్మార్గుఁడా! నీవుచేసినదుష్ట కార్యములకు సహజమయిన మృత్యువు నీకురాదు. ఈదినమున దేవతలకును మానవులకునుసంతోషము కలుగునట్లు నేనే నిన్ను ఖండించివైచెదను.

వి. అం. అపమృత్యువు దుష్కర్మఫలం బని ఇట సూచితము.

వ. అనిపలికి[1] ౪౫

1. ఈవచనము గొన్ని బజారుప్రతులఁ గానవచ్చుట లేదు.



మ. బలువింటన్ గుణటంకృతంబు నిగుడన్
బ్రహ్మాండ భీమంబుగాఁ
బ్రళయోగ్రానల సన్నిభంబగు మహా
బాణంబు సంధించి రా
జలలాముం డగు రాముఁ డేసె ఖరభా
షాశ్రావణున్ దేవతా
బలవిద్రావణు వైరిదారజన గ
ర్భస్రావణున్ రావణున్. ౪౬

టీ. బ్రహ్మాండ+భీమంబుగా = సర్వసృష్టికిని భయము కలుగురీతి, గుణ=అల్లెత్రాటియొక్క, టంకృతంబు= ధ్వని, నిగుడన్=పర్వఁగా, బలు= గొప్పదయిన, వింటన్=ధనుస్సునందు, ప్రళయ+ఉగ్రవాఅనల+సన్నిభంబు+అగు, ప్రళయకాలపు తీక్ష్ణమైన అగ్నితో సమానమయిన, మహా బాణంబున్, సంధించి=చేర్చి, రాజ+లలాముండు+అగు = రాజులలో శ్రేష్ఠుఁడయిన రాముఁడు, ఖర=కఠినమయిన, భాషా = మాటలను, శ్రావణున్=వినిపింపఁజేయువాఁడును అనఁగా కఠినపు బల్కులవాఁడును (ఇట సింహనాదము సూచితము) దేవతా+బల+విద్రావణున్=దేవతలయొక్క సైన్యమును పారిపోవునట్లు చేయువాఁడును, వైరి+దారజన+గర్భ+స్రావణున్ =శత్రువుల భార్యలయొక్క గర్భములు జారిపోవునట్లు చేయువాఁడును, (అగు) రావణు=రావణునికూర్చి, ఏసెను=ప్రయోగించెను.

తా. లోకము లెల్లను భయకంపితంబులగు విధమున అల్లెత్రాటిని మ్రోయించి తీక్ష్ణమగు బాణమును సంధించి రాజశ్రేష్ఠుఁ డగు రాముఁడు అసామాన్యశక్తియుతుం డగురావణుని ఏసెను.

చం. రెండవపాదమున ప్రాసస్థానముం గమనించునది. లళలకు భేదము లేదని సంస్కృతమున సూత్రము. దానం జేసి దీనికి అభేదప్రాసమని పేరు.

వి. అం. ఈపద్యమున వర్ణనావైచిత్ర్యము గలదు. ఇందు శ్రీరాముండు గుణటంకృతంబును రావణుని సింహనాదంబును కవి హృదయంబునఁ బోల్చికొనుచున్నాఁడు. 'ఖరభాషాశ్రావణుఁ,' 'దేవతాబలవిద్రావణుఁ,' 'వైరిదారజనగర్భస్రావణుఁ' అను విశేషణములు పరస్పరసంబంధము లేనివనియు అనుప్రాసమునకై ప్రయోగింపఁబడినవనియుఁ దలంపరాదు. ఈమూఁటికిని సంపూర్ణసంబంధము కలదు. రావణుని సింహనాదము నిగుడుమాత్రన దేవతల సైన్యములు పారిపోవుననియు శత్రువులభార్యలు గర్భవతులై యుండిరేని వారికి రావణుని సింహనాదమువలన గలుగు భయవైపరీత్యముచే గర్భచ్యుతి యగుచుండు ననియు కవిహృదయము. రావణుఁడు ధీరోద్ధతుఁడగు నాయకుఁడు

'అతికోపనుఁ డతిగర్వసమేతుఁ డత్యహంకారబలాన్వితు[1]
డాత్మశ్లాఘోదయచతురుఁడు.'

ఈనాయకునిగుణంబులలో నొక్కటి టవ్యక్తంబు. ఇట్టిశక్తివంతుం డగువాని సింహనాదంబు నణంచునది బ్రహ్మాండభీమంబుగా నిగుడు శ్రీరాముని అల్లెత్రాటినాదంబె కదా !

కథ. రావణుఁడు మూడుయుద్ధములు రామునితో నొనర్చె. రెండవ యుద్ధమున లక్ష్మణుని మూర్ఛితుం జేసి మొదటి రెండుయుద్ధములను రావణుఁడు రామబాణంబులకు నిలువలేక వెడలిపోయె. మూఁడవ యుద్ధారంభమునకుఁ బూర్వమున రావణుఁడు జయముకొఱకు పాతాళహోమము సేయ మొదలిడియె. కాని విభీషణునిభార్య తెలుప వానరులు దానిం జెఱచివైచిరి. అంత రావణుఁడు మండిపడి పట్టుదలతో మూఁడవ యుద్ధమున హోరాహోరిగఁ బోరెను. రాముఁడు తుట్టతుదకు బ్రహ్మాస్త్రంబుం బ్రయోగించి రావణుని దునిమెను, పైపద్యమున వర్ణితమైన యస్త్రం బిదియె.

క. దశరథసూనుం డేసిన
విశిఖము హృదయంబుదూర వివశుం డగుచున్
దశకంధరుండు గూలెను
దశవదనంబులను రక్తధారలు దొరఁగన్ ౪౭

టీ. దశరథసూనుఁడు=శ్రీరాముఁడు, ఏసిన, విశిఖము=బాణము, హృదయంబు=ఎద, దూరన్ =చొరఁగా, వివశుండగుచున్=స్మృతితప్పినవాఁడయి (ఇచట చచ్చియనియే) దశవదనంబులను= పదినోళ్ళనుండియు, రక్తధారలు, దొరఁగన్=స్రవింపఁగా అనఁగా జాఱఁగా, దశకంధరుండు=పది (కంఠములఁ తలల వాఁడు రావణుఁడు, కూలెను=(భూమిపై) పడియెను.

తా. రామునిబాణము ఎదలోఁ గుచ్చుకొని దూఱిపోఁగ నోళ్ళ రక్తము గ్రక్కుచు రావణుఁడు ప్రాణములు విడిచి భూమిమీఁద పడెను,

వ. అంత నారావణుండు దెగుట విని. ౪౮

టీ. తెగుట=చచ్చుట.

సీ. కొప్పులు బిగివీడి కుసుమమాలికలతో
నంసభాగంబుల నావరింప
సేసమత్యంబులు చెదర, గర్ణిక లూడఁ
గంఠహారంబులు గ్రందుకొనఁగ



1. కావ్యాలంకార చూడామణి.

వదనపంకజములు వాడి వాతెఱ లెండఁ
గన్నీళ్ల వఱద లంగములు దడుప
సన్న పునడుములు జవ్వాడఁ బాలిండ్ల
బరువులు నడుములఁ బ్రిబ్బికొనఁగ

నెత్తి మోఁదికొనుచు నెఱిఁబయ్యెదలుజాఱ
నట్టునిట్టుఁ దప్పటడుగు లిడుచు
నసురసతులు వచ్చి రట భూతబేతాళ
సదనమునకు ఘోర కదనమునకు. ౪౯

టీ. కొప్పులు, బిగివీడి=సడలిపోయి, కుసుమమాలికలతో= (అందలి) పూవులమాలలతోడంగూడ, అంసభాగముల=భుజప్రాంతములను (అనగాభుజములపైనుండిపడ దేహముమీఁదికి), ఆవరింప=కమ్ముకొనుచుండ, సేసముత్యంబులు=పాపటిముత్యములు, చెదఱఁగ =(తెగి) చెదఱుచుండ, కర్ణికలు=చెవులయందలికమ్మలు లేక దుద్దులు, ఊడఁగ = ఊడుచుండ, కంఠహారంబులు=మెడలోనిసరములు, క్రిందుకొనఁగ=సందడికొనఁగ అనఁగాఁ జిక్కుపడ,వదనపంకజములు=ముఖకమలములు, వాడి, వాతెఱలు=పెదవులు,ఎండఁగ=ఎండిపోవుచుండ, కన్నీళ్ళ,వఱదలు=ప్రవాహములు,అంగములు= దేహములను,తడుప=తడుపుచుండఁగ, సన్న పునడుములు, జవ్వాడఁగ=చలింపఁగా, పాలిండ్ల=కుచముల, బరువులు, నడుములను, ప్రిబ్బికొనగా=వ్యాపిచుంచుండ, నెత్తి మోఁదికొనుచు నెఱి=క్రమముగా, పయ్యెదలు=పైటలు, జాఱ, అట్టుఁగ, ఇట్లును, తప్పు + అడుగులు, ఇడుచు, అసురసతులు= రాక్షసపతివ్రితలు(రావణునిభార్యలును ఇతరయోధులభార్యలును) భూత=భూతములయొక్కయు, బేతాళ=బేతాళములయొక్కయు, సదనమునకు=వాసస్థానమునకు, కదనమునకు=యుద్ధభూమికి, అట=అచ్చటికి, వచ్చిరి.



తా. విడి వ్యాపించు వెండ్రుకలును, అందుచిక్కుకొని వ్రేలాడు పూలహారములును, చెదఱిపడిపోవు పాపటముత్తెములును, వదలిపోయిన చెవికమ్మలును, చిందరవందరలైపడుచుండు కంఠాభరణములును గలిగి చక్కని ముఖములువాడిపోవ సుందరములగు పెదవులెండిపోవ కంటికి మింటికినొక్కటిగనేడ్చుచు వ్యసనమువలనఁ దూఁగుచు అస్తవ్యస్తముగ నడచుచు నెత్తి నెత్తి కొట్టుకొనుచు అతీవ్రవేదనవలనఁ గ్రిందక్రిందముగ జాఱిపోవుచుండిన పైటలనైనదిద్దుకొనలేక పతివ్రతలగు రావణునిభార్యలును ఇతరయోధుల భార్యలును స్త్రీలుగాన సహజభీరువలయ్యు దుఃఖమువలన భీరుత్వంబునుమానిభూతబేతాళములకు ప్రియమగు యుద్ధభూమికి వెడవెడ నడకల వచ్చిరి.

వ్యా, (1) తప్పు + అడుగులు = (2) తప్పు + టు + అడుగులు (3) తప్పటడుగులు. కర్మధారయంబులందు ఉత్తునకు అచ్చుపరంబగునపుడు టుగాగమం బగు అనుసూత్రముచే రెండవరూపము. ఉత్తునకు అచ్చు పరంబగునపుడు సంధియగు ననుసూత్రముచే మూఁడవరూపము.

వి. అం. ఈపద్యము ఉత్కృష్టమయిన స్వభావోక్త్యలంకారమునకు నుదాహరణము. ఇందు శృంగార, కరుణ, భీభత్సరసంబులు ముప్పిరిగొనుచున్నవి. రాక్షసస్త్రీలని సౌందర్యవతులుగా రనుకొందురేమో. వదనపంకజములు, వాడువాతెఱలు, జవ్వాడు సన్నపు నడుములు, పాలిండ్లబరువులు చెప్పకయె వారి సౌందర్యంబుం జెప్పుచున్నయవి. అసురసతు లనుటలోవారి యనురాగము వ్యక్తము. ఇఁక పద్యమునయంతయు కరుణరసము స్థాయి. రాక్షసవర్ణనఁగాన నెత్తిమోదుకొనుట యుద్ధభూమిగాన భూతబేతాళసదనమనుట భీభత్సోత్పాదకములు. ఈపద్యమునందలి ప్రతిపదంబునకును విపులమగు వ్యాఖ్యవ్రాయనగును. కాని గ్రంథవిస్తరంబగుట నిది సందర్భముగాదు.

కాన ¹ఇట్టిపద్యము లాంధ్రవాఙ్మయమున నలుదనుటతో విరమింతము. ఇట్టివి పదములతో లిఖించిన చిత్తరువులు గదా?

వ. ఇట్లు వచ్చి తమనాథులం గని శోకించి రందు మందోదరి
రావణుం జూచి యిట్లనియె.

టి. నాథులను = మగళ్ళను, శోకించిరి=దుఃఖపడిరి.

ఉ. హాదనుజేంద్ర ! హాసురగ
ణాంతక హాహృదయేశ ! నిర్జరేం
ద్రాదులగెల్చి నీవు కుసు
మాస్త్రునికోలల కోర్వలేక సో
న్మాదమునన్ రఘుప్రవరు
మానిని నేటికిఁ దెచ్చి తప్పుడే
గాదని చెప్పినన్ వినక
కాలవశంబునఁ బొంది తక్కటా. ౧౧

టీ. *హా=అయ్యో, దనుజ+ఇంద్ర=రాక్షసులకు రాజా, హా, సుర గణ+అంతక=దేవతలసమూహమునకు యముఁడా అనఁగా దేవతలకు మృత్యువునాపాదించువాఁడా, హాహృదయేశ=అయ్యోనావనో నాయకుఁడా, నిర్జరేంద్ర+ఆదుల=ఇంద్రుఁడు మొదలుగాఁ గలవారిని, గెల్చి, నీవు, కుసుమాస్త్రుని=పూలు బాణములుగాఁగలవాని అనఁగా మన్మథుని, కోలలకు=బాణములకు, ఓర్వలేక=నిలువలేక, స+ఉన్మాదమునన్ = వెఱ్ఱితనముచేత, రఘుప్రవరుమానిని=రఘుకుల సంజాతుఁడగు రామునిభార్యను సీతను, ఏటికి= ఎందులకు, తెచ్చితివి, అప్పుడు, ఏన్=నేను, కాదు=తగదు, అని, చెప్పినన్, వినక, కాలవశంబునన్, యమునియొక్క అధీనమున, పొందితి=వాలితివి, అక్కటా= ఎంతసంతాపమునకుఁ గారణమయ్యె నయ్యో యని భావము.

తా. రాక్షసులకు రాజవై దేవతలకు మృత్యువవై దేవేంద్రుని జయించినట్టి ఓప్రాణనాథా! నీవు కామమును జయింపలేక సీతను మదమున నపహరించుకొనివచ్చి విధిప్రేరితుఁడవై నేను బోధించినను తెలిసికొనలేక ఈ విధముగ కూలితివే! ఏమి చేయుదు !

ఆ. ఎండ గాయ వెఱచు నినుఁడు, వెన్నెలఁ గాయ
వెఱచు విధుఁడు గాలి వీవవెఱచు
లంకమీఁద నిట్టి లంకాపురికి మాకు
నధిప విధవభావ మడరె నేఁడు. ౧౨

టీ. లంకమీఁద, ఇనుఁడు=సూర్యుఁడు, ఎండన్+కాయన్=ఎండను ప్రకాశింపఁజేయ, వెఱచు=భయపడుచుండును, విధుఁడు=చంద్రుఁడు, వెన్నెలన్+కాయన్, వెఱచు, గాలి, వీవన్=విసర, వెఱచున్, ఇట్టిలంకాపురికి, మాకు, నేఁడు = ఈదినము, విధవభావము = ధవుఁడులేనిభావము అనఁగా మగఁడుపోవుట, అడరెన్=సమకూరెను, అధిప=నాథా.

---

1. ఈయర్థము కంటి విషయమున మాత్రము భారతప్రయోగముగఁ గానవచ్చెడు. ఇట నీయర్థము చెప్పనిచో కాలవశంబును బొందితివని ద్వితీయ యుండవలయు. ద్వితీయార్థమందు సప్తమి యని యైన ననవలయు. ఇవి మిక్కిలియసాధారణంబులు.ఒకవేళ కవి కాలవశంబును బొంది తక్కటాయనియే వ్రాసెనేమొ. ఈరెంటిని వ్రాతయందు లేఖకులు పొరపడివ్రాయుట ఆశ్చర్యకరముగాదు. అయిన వ్రాతప్రతుల యాధారములేక మార్చుటతగదు గాన ఈపాఠము అంగీకరించి యుండలేదు.

తా. ఓనాథా, ఇంతకాలమును సూర్యచంద్రాదులు లంకయందు తమ తమ పనులను నీ యాజ్ఞలేక చేసికొన భయపడుచుండిరి. నేడు నీవుపోవుటచే లంకయు మేమును విధవలమయి పోయితిమి. లంకనైనందఱును విచ్చలవిడిగ అధికారము సేతురుగదా !

వ్యా. కాయు ధాతువు ప్రకాశించు అనుఅర్థమున తెలుచుగ నకర్మకము. ఇట సకర్మకం బయినది.

వెల్ల + నెల రెండునుంజేరి వెన్నెల యయినది.

క. దురితముఁ దలఁపరు గానరు
జరుగుదు రెట్టైన నిమిషసౌఖ్యంబులకై
పరవనితాసక్తులకును
బరధనరక్తులకు నిహముఁ బరముం గలదే. ౫౩

టీ. దురితము=పాపమును, తలఁపరు=యోజింపరు, కానరు = చూడఁజాలరు అనఁగా పూర్వాపరవిచారమునకు శక్తిలేని వారగుదురు, నిమిషసౌఖ్యంబులకై = అల్పసుఖములకయి, ఎచ్చటికైనను = ఏస్థితిలోనికైనను, జరుగుదురు=పోదురు జారుదురు అనఁగా ఎట్టినీచమయిన హేయమయినఅవస్థలు తటస్థించినను ఇయ్యకొందురనుట, పర + వనిత + ఆసక్తులకును= ఇతరస్త్రీలయందు ఆసఁగొన్నవారికిని, పర + ధన + రక్తులకు=ఇతరుల ద్రవ్యమునందు ఆశ [illegible] వారికిని, [illegible] = ఈలోకమును, పరముఁ = పైలోకమును, కలదే=కలదా(లేదనుట).

తా. అన్యస్త్రీలను ఇతరులధనమును అపహరింపఁజూచువారు పాపభయములేక కన్నుగానక ఉన్మత్తులయి ప్రవర్తింతురు. వారికి ఈలోకమునకీర్తిసుఖములుగాని పరలోకమున ముక్తిగాని లేదు.



వి. అం. ఈపద్యమునందలి పదార్థాన్వయ విశేషముం గమనించునది. మొదటి రెండుపాదములయందును కర్తను పేర్కొనక క్రియలబలంబుననె యర్థమును నిర్వహించి అధ్యాహారం బయినకర్తలనుదరువాతిపాదములయందు సూచించియున్నాఁడు. మనభాషయందలి విశేషంబులలో నిది యొకటి.

వ. అని విలపింప నంత విభీషణుండు రామచంద్రుని పంపువడసి
రావణునకు దహనాదిక్రియలు గావించె నంత రాఘ
వేంద్రుండు నశోకవనంబున కేఁగి శింశుపాతరు సమీ
పంబునందు. ౫౪

టీ. విలపింప = దుఃఖమును వెలిఁబుచ్చ, పంపువడసి = ఆజ్ఞఁగొని, దహన + ఆది + క్రియలు= (మరణానంతరము జరుగు) కాల్చుట మున్నగు కర్మలు, శింశుపా + తరు + సమీపంబునందు= ఇరుగుడు మ్రాని చేరువ.

తా. సుగమము.

వి. అం. ఈచిన్నవచనమున 'అంత' రెండుపర్యాయములు వాడనూపి కథాభాగమును బహుత్వరితముగ హ్రస్వము చేసిన దని యెఱుంగునది.

మొదటి 'యంత' వలన విభీషణుఁడు పాపియగు తనయన్నకు నుత్తరక్రియలు చేయుట ధర్మము కాదని శంకించుటయు ఆశంకల శ్రీరాముఁడు దీర్చుటయు సూచితము.

శా. దైతేయప్రమదాపరీతనతిభీ
తగ్రంధి బంధాలక
వ్రాతః నిశ్వసనానిలాశ్రుకణజీ
వంజీవదారామ భూ

జాతాం శుష్కకపోల కీలితకరా
బ్జాతాం ప్రభూతాం గృశీ
భూతాం బ్రాణసమేత సీతఁ గనియెం
భూమీశుఁ డామందటన్. ౫౫

టీ. ఆముందటన్, దైతేయ=రాక్షసులైన, ప్రమదా=స్త్రీలచేత, పరీతాం=చుట్టఁబడినదానిని, అతిభీతాం=మిక్కిలిభయమందిన దానిని, గ్రంధి=ముడియందు, బంధ=చేరుకొనిపోయిన, అలక=ముంగురులయొక్క అనఁగా వెండ్రుకలయొక్క, వ్రాతాం = సమూహము గలదానిని (మొత్తముమీఁద, చిరకాలము దువ్వి చక్క పెట్టకపోవుటచే జడలు కట్టుకొనిపోయిన వెండ్రుకలు కలదానిని, అని యర్థము), నిశ్వసన = నిట్టూర్పుయొక్క, అనిల = గాలిచేతను, అశ్రు=కన్నీళ్లయొక్క, కణ=బిందువులచేతను, జీవంజీవత్ =మిక్కిలిపోషింపఁబడిన, ఆరామ = ఉద్యానవనమునందలి, భూజాతాం =వృక్షములుకలదియు, శుష్క=ఎండిపోయిన, కపోల=చెక్కిలియందు, కీలిత=తగిలింపఁబడిన, కర + అబ్జాతాం = హస్తకమలములుకలదానిని, ప్రభూతాం= (మనస్సుయొక్క) ఔన్నత్యము కలదానిని, కృశీభూతాం = సన్నగిల్లిపోయినదానిని, ప్రాణసమేతాం=ఉసురులతో కూడుకొనిన దానిని, సీతాం, భూమీశుఁడు=శ్రీరాముఁడు, కనియెన్=చూచెను.

తా. రాక్షసస్త్రీలచేతఁజుట్టఁబడినదియు, భయముచేనిండినదియు, జడలు కట్టినవెండ్రుకలు కలదియు, నిట్టూర్పులచేతను గన్నీళ్లచేతనువనమునంతయు నింపుచుండునదియు, కృశించిపోయినచెక్కిళ్లపై హస్తము చేర్చి యధోముఖయయి చింతించునదియు, అయినను మానసౌన్నత్యము గలదియుఁ, బూర్తిగఁ జిక్కిపోయి ప్రాణావశిష్ట యైనదియు నగుసీతను జూచెను.



వి. అం. ఆహా! ఏమిచిత్రిపటం బిది! రాముఁడు భర్త. బహుకాలము వియోగదుఃఖంబున నుండినభార్యను జూచుచున్నాఁడు. మొదటఁ గన్పించువారు రాక్షసస్త్రీలేగదా! భర్త భార్యమోముఁగదా మొదట చూచు. సీతకు ఆననంబున దైన్యంబే కదా కలదు. మోముతోడన ముంగురులుగదా ప్రియునకుఁ బ్రీతినొసంగు. అయ్యవి అల్లుకొనిపోయి యున్నవిగదా! వ్యసనమున చెక్కిలిపై హస్తము స్త్రీలకు స్వాభావికం బౌనుగాదె. హస్తము చెక్కిలిం జేర్చిన యధోముఖంబె గదా. అట్లగుట భర్తరాక సులభంబుగ గ్రాహ్యంబు గాదు గాదే! కావున నిశ్వాసంబులును అశ్రుకణములును బొరలుచునే యుండుట భర్తకు అనివార్యంబయి కన్పట్టుఁగా! శుష్కీభూత యయ్యు ప్రాణసమేతగా నుండి ఇట్టిదైన్యము ననుభవించుచుంట మానసౌన్నత్యంబు గదా! అలకశబ్దంబును గరాబ్జశబ్దంబును ఎట్టిదురవస్థయందును భార్యాభర్తలవియోగాంతమున నుపయోగించుట రసోత్కర్షకుంగాదె

వ. కని రామచంద్రుఁడును దాపంబు నొంది భార్యవలన దోషంబు లేకుండుట వహ్నివలనం బ్రకటంబు సేసి దేవతల పంపున దేవిం జేకొని. ౫౬

టీ. కని, రామచంద్రుఁడును, తాపంబు=సంతాపము, ఒంది=పొంది భార్యవలన, దోషంబు=పాపము, లేకుండుట, వహ్నివలనన్=అగ్నిమూలము ప్రకటంబు=బహిరంగము, చేసి, దేవతల, పంపున=ఆజ్ఞచేత, దేవిన్, చేకొని=స్వీకరించి

తా. సుగమము.

వి. అం. 'దోషంబు లేకుండుట వహ్నివలనం బ్రకటంబు చేసి' యనుటలోఁ దనకుఁ దనభార్య నిర్దోషురాలని తెలిసియుండియు శ్రీరాముఁడు,

లోకమునకు అగ్నిమూలమున ఆయమ దోషరహిత యని ప్రకటింపించెనని ధ్వని.

కథ. ఇచ్చటి రామాయణకథకును పోతనామాత్యునికథకును భేదము కనుపించుచున్నది. రామాయణమున రావణవధానంతరము విభీషణుఁడు అతని ఉత్తరక్రియలు నిర్వర్తించుచున్నాఁడు. పిమ్మట విభీషణపట్టాభిషేకము జరుగుచున్నది. తదనంతరము శ్రీరాముఁడు దనవిజయమును సీతాదేవికిం జెప్పుటకు ఆంజనేయునిఁ బంపుచున్నాఁడు. అంత విభీషణుఁడు రాముని పంపున సీతాదేవికి మంగళస్నానాదులు చేయించి కొనితెచ్చుచున్నాఁడు. రాముఁడు సీతను నిరాకరించుచున్నాఁడు. ఆమె యగ్నిప్రవేశంబు చేసి తనపావనత్వమును బ్రకటించుచున్నది. అగ్న్యాదుల ప్రార్థనంబున శ్రీరాముఁడు సీతను స్వీకరించుచున్నాఁడు. పోతనామాత్యుఁడీకథను కొంత మార్చియున్నాఁడు. శ్రీరాముఁడు స్వయముగనే సీతను జూడఁబోయినట్లును లోకమును సంతుష్టి పఱచుటకయి అగ్నివలన సీతాదేవి నిర్దోషిత్వమును నిరూపింపించినట్లును విభీషణునకు పట్టము గట్టినట్లును బోతనామాత్యుఁడు తోఁపింపఁజేసినాఁడు. రామాయణమున శ్రీరాముఁడు పరమాత్ముని యవతారము మాత్రమే. సహజపాండిత్యముచే జనియించిన మహాద్భుతకవితాశక్తిగల పోతనామాత్యునికి శ్రీరాముఁడు అవతారమాత్రం బెకాదు. ఉత్తమప్రకృతి గల ధీరోదాత్త నాయకుండును. కావున నీకథాభేదం బని తోఁచెడిని.

ఉ. శోషిత దానవుండు నృప
సోముఁడు రాముఁడు రాక్షసేంద్రతా
శేషవిభూతిఁ గల్పసమ
జీవివి గమ్మని నిల్పె నర్థి సం



తోషణుఁ బాపశోషణు న
దూషణు శశ్వదరోషణున్ మితా
భాషణు నార్యపోషణుఁ గృ
పాగుణభూషణు నవ్విభీషణున్. ౫౭

టీ. శోషితదానవుండు = పరితాపవిహీనులుగఁ జేయఁబడిన రాక్షసులు గలవాఁడయిన, నృప + సోముఁడు = రాజులలో చంద్రుఁడు అనఁగా రాజశ్రేష్ఠుఁడు రాముఁడు, అర్థి + సంతోషణున్ = యాచకులను సంతోషపెట్టువాఁడును. అనఁగా దాతయు, పాపశోషణున్ = పాపములను ఎండిపోవునట్లు చేయువాఁడును అనఁగా పాపములు లేనివాఁడును, అదూషణున్ = ఇతరుల దూషణము లేనివాఁడును అనఁగా దూషింపనివాఁడును, శశ్వత్ + అరోషణున్ = ఎల్లప్పుడు లేనికోపము గలవాఁడును అనఁగా పూర్ణశాంతుఁడును, మిత + ఆభాషణున్ = కొద్దిమాటలవాఁడును, ఆర్యపోషణున్ = బుధులను పోషించువాఁడును, కృపా + గుణ + భూషణున్ = దయయనెడు గుణము అలంకారముగాఁ గలవాఁడును అగు, ఆ, విభీషణున్; రాక్షస + ఇంద్రతా + అశేష + విభూతిన్ = రాక్షసరాజుయొక్క సంపూర్ణసంపదయందు, కల్పసమజీవివి = కల్పముతో సమమయిన, జీవనము కలవానివి అనఁగా లోకాంతమువఱకు ఉండువాఁడవు చిరంజీవివి, కమ్ము = అగుము, అని, నిల్పెన్ (ఇట అభిషేకము చేసె నని భావము.)

తా. రాక్షసులను బరాజితులను చేసినరాజచంద్రుఁ డగు రాముఁడు దాతయు పాపరహితుఁడును పరనిందచేయనివాఁడును శాంతుఁడును మితభాషియు సత్పురుషుల పోషించువాఁడును దయావంతుఁడును నగు విభీషణునకు శాశ్వతమగు పట్టము గట్టెను.

కల్పము. ఇది బ్రహ్మ కొక్కదినమని వాడుక. దీనిపరిమాణము ౧,౦౦౦ యుగములు; ౪౦,౦౦,౮౫,౦౦౦ సంవత్సరములు.

వ. ఇట్లు విభీషణసంస్థాపనుండై రామచంద్రుండు సీతాలక్ష్మణ
సమేతుండై సుగ్రీవహనుమదాదులం గూడికొని పుష్పకా
రూఢుండయి వేల్పులుగురియు పువ్వులసోనలం దడియుచు
దొల్లివచ్చిన తెరువుజాడలు సీతకు నెఱింగించుచు మరలి
నందిగ్రామంబునకు వచ్చె నయ్యవసరంబున. ౫౮

ఇట్లు విభీషణసంస్థాపనుండై = విభీషణుని స్థాపించినవాఁడయి రామచంద్రుఁడు, సీతాలక్ష్మణసమేతుండై=సీతాలక్ష్మణులతో గూడుకొనినవాఁడయి, సుగ్రీవహనుమదాదుల=సుగ్రీవుఁడు హనుమంతుఁడు మొదలగువారిని, కూడికొని, పుష్పకారూఢుం డయి=పుష్పకము నెక్కి, వేల్పులు= దేవతలు, కురియు, పువ్వుల సోనలన్ = అల్పవర్షమునందు, తడియుచు = మునుఁగుచు, తొల్లి = మొదట, వచ్చిన, తెరువు జాడలు = మార్గముల గుర్తులు, సీతకు, ఎఱింగించుచు, మరలి, నందిగ్రామంబునకు, వచ్చె, అయ్యవసరంబున = ఆసమయమున అనఁగా అప్పుడు.

తా. సుగమము.

వి. అం. నందిగ్రామము. శ్రీరాముఁడు అరణ్యవాసమున కరుగుటయు ఆదెబ్బచే దశరథుఁడు లోకాంతరగతుఁ డగుటయు విని భరతుఁడు శోకసంతప్తమానసుఁ డయి తల్లికైకం దూలనాడి రాముని వేఁడి మరల రాజ్యభారము వహించునట్లు చేయ నుద్యమించి తానును అతని వెంట నరణ్యమునకు జనియెను. రాముఁ డద్దానికంగీకరింపక పితృవాక్యపరిపాలనమే ముఖ్యముగా



బట్టినందున భరతుఁడు విఫలమనోరథుఁడయి శ్రీరాములపాదుకలం గొని తెచ్చి అయోధ్యయందు వానిని సింహాసన మధిష్ఠింపఁజేసెను. నాఁటినుండి రాముఁడు లేని యయోధ్యయం దుండ నొల్లక భరతుఁడు ఆపురిని విడిచి సమీపమం దుండిన నందిగ్రామమును జేరి అచ్చటనుండి రాజ్యపాలనము సేయుచుండెను. అరణ్యవాసము ముగించి రావణవధానంతరము శ్రీరాముఁ డటకు వచ్చెను.

ఆ. రామచంద్రవిభుని[1] రాక వీనుల విని
భరతుఁ డుత్సహించి పాదుకలను
మోచికొనుచు వచ్చి ముదముతోఁ బురజను
లెల్లఁ గొలువ నన్న కెదురు వచ్చె. ౫౯

టీ. రామచంద్రవిభున్, రాక=వచ్చుట, వీనుల=కర్ణములచేతఁ అనఁగా చెవులారయని భావము, విని, భరతుఁడు, ఉత్సహించి=ఉత్సాహముకలవాఁడయి, పాదుకలను, శ్రీరాములకు బదులుగ సింహాసనమునఁ గూర్చుండఁ బెట్టియుండిన పాదుకలను, మోచికొనుచువచ్చి=మోసికొనుచు వచ్చి, ముదముతో=సంతోషముతో, పురజనులెల్ల= పౌరు లందఱును, కొల్వ = కొలిచి రాఁగా, అన్నకు, ఎదురువచ్చె స్వాగతమియ్యవచ్చెనని భావము.

తా. శ్రీరాముఁడు వచ్చుట చెవులారవిని సంతోషించి పౌరులందఱు వెంటనడువ తాను అన్నయొక్కపాదుకలను దీసికొని అతనికి స్వాగతమియ్య భరతుఁడు బయలుదేఱెను.

వ. వచ్చి పాదుకలు ముందట నిడికొని యెడనెడ సాష్టాంగదండ
ప్రణామంబు సేయుచు మెల్లన డాసి రామచంద్రునిపాదం
బులు దన నొసలం గదియించి తచ్చరణరేణువులు దుడిచి
శిరంబునం జల్లికొని తనివి సాలక మఱియు నప్పదకమ

1. రామచంద్రవిభుఁడు రాక యని

లంబు లక్కున మోపికొనుచు సంతసంపుఁ గన్నీటం గడిగి
సేమంబు లరయు చుండె నంత సీతాలక్ష్మణసహితుం డై
విభుండును దన కెదురు వచ్చిన బ్రాహ్మణజనంబులకునమ
స్కరించి తక్కినవారలచేత మన్ననలు వొంది వారల
మన్నించె నయ్యవసరంబున. ౬౦

టీ. వచ్చి, పాదుకల, ముందఱ, ఇడుకొని=పెట్టుకొని, ఎడనెడన్ నడుమనడుమ, సాష్టాంగదండప్రణామంబు=ఎనిమిది యంగములను కఱ్ఱవలె పడవైచిచేయునమస్కారము (పాదములును, మోఁకాళ్లును, ఎదయును, శిరస్సును, హస్తములును, దృష్టియు, వాక్కును, బుద్ధియు నను ఎనిమిదియు నేకాగ్రిముగ నునిచి చేయు నమస్కారము), చేయుచు, మెల్లనడాసి=దగ్గఱ చేరి, రామచంద్రుని పాదంబులు, తన, నొసలన్=ఫాలమున, కదియించి = చేర్చి, తత్=ఆతని, చరణరేణువులు=పాదసంబంధిధూళి, తుడిచి, శిరంబున = తలమీఁద, చల్లికొని, తనివిసాలక=తృప్తిచాలక, అనఁగా అంతటితో తృప్తి నొందక, మఱియును, అప్పదకమలంబులు=ఆపాదముల నెడు కమలములను, అక్కునన్=ఎదపై, మోపికొనుచు, సంతసంపుకన్నీటన్=సంతోషముచేత వెలువడుచుండిన కన్నీటితో, కడిగి, సేమంబులు=క్షేమసమాచారములు, అరయుచుండెను=తెలిసికొనుచుండెను, అంత (ఇఁక చెప్పనది వేరువిషయ మనుట)

“ కరయుగమును చరణంబులు
నురము లలాటస్థలంబు నున్నతభుజముల్
సరి ధరణి మోపి మ్రొక్కినఁ
బరువడి సాష్టాంగ మండ్రు పరమమునీంద్రా”

అని సాధారణపద్యము. ఇది విశ్వసనీయము గాదు.



సీతాలక్ష్మణసహితుండై=సీతాలక్ష్మణులతోఁ గూడుకొనినవాఁడై, విభుండును రాముఁడును, తనకు, ఎదురువచ్చిన, బ్రాహ్మణజనంబులకు నమస్కరించి, తక్కిన వారలచేత, మన్ననలు వొంది=గౌరవింపబడి, వారలన్, మన్నించెను=గౌరవించెను, అయ్యవసరంబున=ఆసమయంబున.

తా. సుగమము.

చ. నృపవర పెక్కునాళ్ల గొలె
నిన్ గనకుండినయట్టి నేఁడు మా
తపములు పండె నిందఱము
ధన్యుల మైతి మటంచుఁ బుట్టముల్
చపలతఁ ద్రిప్పి పువ్వుల వ
సంతము లాడుచుఁ బాడుచున్ గత
త్రపు లయి యాడుచుం బ్రజలు
దద్దయుఁ బండుగు సేసి రెల్లెడన్. ౬౧

టీ. నృపవర=రాజశ్రేష్ఠుఁడా, పెక్కునాళ్లఁ గొలె=బహుదినముల నుండి, నిన్, కనకుండినయట్టి=చూడక యుండిన, నేఁడు=ఈదినమున, మాతపములు=మానోములు, పండెను, ఇందఱము, ధన్యులము=కడతేరినవారము, ఐతిమి, అటంచు=అనుచు, ప్రజలు=రాజ్యములోని జనులు, చపలత = సంతోషముచేతనైనఁ భ్రమచేత, పుట్టముల్ = పైనవేసుకొనిన వస్త్రములను, త్రిప్పి, పువ్వులవసంతములాడుచు=పువ్వులతోఁడి వసంతమును ఒకరిపైనొకరు చల్లుకొనుచు, లేదా, పువ్వులే వసంతమువలె ఒకరిపై నొకరు చల్లుకొనుచు, పాడుచున్=పాటలుపాడుచు, గత=పోయిన, త్రపులయి = సిగ్గుగలవారయి, ఆడుచున్=నాట్యము సేయుచు, తద్దయు=విశేషముగ, ఎల్లెడన్=అన్నిస్థలములయందును, పండుగుచేసిరి.

తా. రాజ్యములోని జనులు 'ఓరామా, చాలాకాలముగనిన్ను చూడ నట్టిమాకు నేఁడు నీరాకవలన జన్మము సఫలమయినది' అనుచు సంతోషము వలననైన భ్రమచే పైగుడ్డలను ఎగురవైచుచు పూలవసంతములుచల్లుకొనుచు సిగ్గువిడిచి ఉత్సాహముచే ఆడుచు పాడుచు మహోత్సవముఁ జేసిరి.

వి. అం. నిన్ననఁడుండినయట్టి నేఁడు మాతపములు అనుటలో నేఁడు అనుపదము విశేషణం బగు నిన్ననకుండినట్టి కిని సర్వనామవిశేష్యం బగు మా' కును నడుమఁబడినది. ఇది కవి స్వాతంత్ర్యం బనవచ్చును. లేదా 'నేఁడు' అనువిశేష్యంబునకే 'నిన్ననకుండిన యట్టి' యను విశేషణం బనినను అనవగు నేమో. ఇట్లనినచో బహుకాలముగ నిన్నిస్థితియందుఁ గాననిని ఈదిన మున అనియర్థము చెప్పవచ్చును. అయిన నీరెండవపక్షము రెండవపక్షంబె.

సీ. కవగూడి యిరుదెసఁ గపిరాజు రాక్షస
రాజు నొక్కటఁ జామరములు వీవ
హనుమంతుఁ డతిధవళాతపత్రముఁ బట్ట
బాదుకల్ భరతుండు భక్తిదేఁ
శత్రుఘ్నుఁ డమ్ములు జాపంబుగొని రాఁగ
సౌమిత్రి భృత్యుఁడై చనవు నూప
జలపాత్రఁ జేపట్టి జనకజ గూడిరాఁ
గాంచనఖడ్గ మంగదుఁడు మోవ
బసిఁడికేడె మర్థి భల్లూకపతి మోచి
కొలువఁ బుష్పకంబు నెలమి నెక్కె
గ్రహము లెల్ల వెలయఁ గడునొప్పు సంపూర్ణ
చంద్రుపగిది రామచంద్రుఁ డొప్పె. ౬౨



టీ. కవగూడి=జంటగా, ఇరుదెస=రెండుప్రక్కలను, కపిరాజు=సుగ్రీవుఁడును, రాక్షసరాజు=విభీషణుఁడును, ఒక్కట=ఒకేవిధముగ, చామరములు=చామరలు, వీవ = విసరుచునుండ, హనుమంతుఁడు, అతిధవళ=మిక్కిలి తెల్లనైన, ఆతపత్రమున్=గొడుగు, పట్టన్=పట్టఁగా, భరతుండు, పాదుకల్ = పావుకోళ్లు, భక్తిన్, తేరన్ = తేఁగా, శత్రుఘ్నుఁడు, అమ్ములు, చాపంబు= ధనుస్సును, కొనిరాఁగ, సౌమిత్రి=లక్ష్మణుఁడు, భృత్యుఁడై= సేవకుఁడయి, చనవు=(రామునియొక్క) కోరికలను, చూప = తెలియఁజేయు చుండఁగా, జలపాత్ర=నీటికలశమును, చేఁబట్టి, జనకజ=సీతాదేవి, కూడిరా=చేరి, రాఁగా, అంగదుఁడు, కాంచనఖడ్గము = బంగారుకత్తి (అనఁగా బంగారుపిడితో నలంకరింపఁబడిన కత్తియని), మోవన్=మోసికొనిరాఁగా, భల్లూకపతి = (ఎలుగుబంట్లప్రభువు) జాంబవంతుఁడు, పసిఁడికేడెము=బంగరుడెక్కెమును, అర్థిన్ = ప్రేమతో, మోసి, కొలువ, రామచంద్రుఁడు, పుష్పకంబున్, ఎలమిన్=సంతోషముతో, ఎక్కి, గ్రహము లెల్లన్ = (తన్నాశ్రయించిన) అన్ని గ్రహములును, వెలయన్=ప్రకాశింపఁగా, కడున్=ఎక్కువగా, ఒప్పు=సొంపుమీఱు, చంద్రుపగిది=చంద్రునివలె, ఒప్పె=సొంపుమీఱెను.

తా. విభీషణ సుగ్రీవులు చామరములు వైవ హనుమంతుఁడు ఛత్రము పట్ట భరతుఁడు పావుకోళ్లు తీసికొనిరాఁగ శత్రుఘ్నుఁడు ధనస్సును అమ్ములనుకొనిరాఁగ లక్ష్మణుఁడు తన సేవకుఁడుగ నుపచరించుచుఁ దనయాజ్ఞలను దెలుపుచుండఁగ సీతాదేవి బంగరుగిండిలో జలమును గొని వెంటనడువ అంగదుఁడు బంగరు ఖడ్గమును జాంబవంతుఁడు బంగరు డెక్కెమును మోసికొనిరా వెడలి శ్రీరాముఁడు పుష్పకము నెక్కెను.

వ్యా. తేర యనునది తీసికొనిరాఁగ అను నర్థమున తెచ్చుయొక్క విశేషరూపము. తేర యనుపదమునకు నితరార్థములు 'తేట', 'సంబంధము లేని'హ్యర్థము గా' 'అనాయాసముగా'.

వ. ఇట్లు పుష్పకారూఢుండై కపిబలంబులు చేరి కొలువ శ్రీరాముం డయోధ్యకుం జనియె నంతకుమున్న యప్పురంబునందు- ౬౩

సీ. వీథులు సక్కఁగావించి[1] తోయంబులు
చల్లి రంభాస్తంభ చయమునిలిపి
పట్టుచీరలు చుట్టి బహుతోరణంబులుఁ
గలువడంబులు మేలుకట్లుఁ గట్టి
వేదిక లలికించి వివిధరత్నంబుల
ముగ్గులు పలుచందములుగఁ బెట్టి
కలయ గోడల రామకథ లెల్ల వ్రాయించి
ప్రాసాదముల దేవభవనములను
గోపురంబుల బంగారుకుండ లెత్తి
యెల్ల వాకిండ్లఁ గానిక లేర్పఱించి
జనులు గైసేసి తూర్యఘోషములతోడ
నెదురునడతెంచి రా రాఘవేంద్రుకడకు. ౬౪

టీ. వీథులు, చక్కన్=బాగు, కావించి, తోయంబులు=నీళ్లు, చల్లి, రంభా+స్తంభ+చయము=అరఁటికంబముల సమూహమును, నిలిపి, పట్టుచీరలు=పట్టుగుడ్డలు, చుట్టి, బహు=అనేకములయిన, తోరణంబులున్, కలువడంబులున్=కలువపూలహారములును, మేలుకట్లు = వితానములు అనఁగా వైభవపుపందిళ్లనిభావము, కట్టి, వేదికలు=అరుగులు, అలికించి, వివిధ=నానావిధములగు, రత్నంబుల, ముగ్గులు, పలుచందములుగ = అనేకరీతులుగ అనఁగా అనేకాకారములుగలుగ, పెట్టి, గోడల అనఁగా గోడలమీఁదననుట, రామకథలెల్ల=శ్రీరామునివృత్తాంత మంతయు, కలయ=(సొంపుగ) కూడునట్లు, వ్రాయించి=లిఖింపించి (ఇచ్చట చిత్తరువులాదిగాఁ గొనవలయును) ప్రాసాదములన్=పురియొక్క చుట్టుగోడలమీఁదను, దేవభవనములను= దేవాలయములయందును, గోపురంబులను, బంగారు, కుండలు=కలశములు, ఎత్తి అనఁగా నిలిపి యనిభావము, ఎల్లవాకిండ్లన్=అన్నితలుపులకడ అనఁగా ప్రతి గృహము ముందటను, కానికలు=గౌరవముచూపునవియగు ఈవులు, (వీనిని ఇప్పుడు నజరులు అందుము) ఏర్పఱించి=ఏర్పాటుచేసి, జనులు=ప్రజ, కైసేసి=అలంకరించుకొని, తూర్యనాదములయొక్క, ఘోషములతోడ=శబ్దములతోడ, ఆరాఘవేంద్రుకడకు=శ్రీరాములవైపునకు, ఎదురు, నడతెంచిరి= నడచిరి.

1. నున్న గావించి యని పా. అం.



తా. శ్రీరాములరాకవిని పురజనులు వీధులు శుభ్రముచేయించి మార్గమును అరఁటికంబములచేతను వితానములచేతను పట్టువస్త్రములచేతను పూలమాలలచేతను అలంకరించి గోపురములమీఁద కలశములుంచి తమతమయిండ్లకడ గూడ నుచితవిధి నలికి ముగ్గుపెట్టి పూయించి చిత్తరువులు వ్రాయించి యలంకారముచేసియుంచి యిండ్లముంగిళ్ల నుచితమగు కానుకలను సిద్ధముగఁ బెట్టి తాము నలంకారముచేసికొని మంగళవాద్యములతో మహోత్సవముగ వెలువడి శ్రీరాముని ఎదురుకొని కొనితెచ్చుటకుం జనిరి.

క. సమదగజదానధారల
దుమదుమలై యున్న పెద్దత్రోవలతోడన్
రమణీయ మయ్యె నప్పురి
రమణుఁడు వచ్చిన కరంగు రమణియుఁబోలెన్.[1] ౬౫

1. రమణియపోలెన్. అని పా. అం.

టీ. సమద=మదముతోఁగూడుకొనిన అనఁగా మదించిన, గజ=ఏనుఁగులయొక్క, దానధారలన్=మదజలముయొక్క కారుటచేత, దుమదుమలై=కొంపి యయి, ఉన్న, పెద్దత్రోవలతోడన్=రాచబాటలతో, ఆ+పురి, రమణుఁడు=మగఁడు, వచ్చిన=రాఁగా, కరంగు = (అనురాగముచేత) ద్రవించు, రమణియున్=స్త్రీయు, పోలెన్=వలెనే, రమణీయము = ఇంపులు కలుగునది, అయ్యెన్=అయెను.

తా. రాచబాటలయందు మదించిన ఏనుఁగుల రాకపోకలచేత వాని దేహములనుండి జారిన మదజలములవలన చిఱుబురద యేర్పడెననియు అది అలంకారావహంబె యనియు.

వి. అం. ఇచ్చట నుపయోగింపఁబడిన రమణుఁడు వచ్చిన కరంగు రమణియుంబోలె అను ఉపమానముచే 'స్వేదము' నాఁబరగు సాత్త్వికభావము సూచితము.

ఆ. రామభూవరేంద్రు రాకఁ దూర్యములతో
రథగజాశ్వసుభట రాజితోడ
నమరెఁ బురము చంద్రుఁ డరుదేర ఘూర్ణిల్లు
జంతుభంగమిళిత జలధిభంగి. ౬౬

టీ. రామ+భూవర+ఇంద్రు=రామనృపాలశ్రేష్ఠుని, రాకన్ = వచ్చుటయందు (రాక యనుపదముచే నిండుచందురుఁడు గల పౌర్ణిమ యనియు ధ్వని), పురము=పట్టణము, తూర్యములతో =వాద్యములతోను, రథగజ అశ్వసుభట రాజితోడ=రథములయొక్కయు ఏనుగులయొక్కయు గుఱ్ఱములయొక్కయు మంచిభటులయొక్కయు సమూహముతోడ, చంద్రుఁడు, అరుదేర=రాఁగ, ఘూర్ణిల్లు=(ధ్వానయుక్తముగ) తిరుగుడువడు, జంతు+



భంగ+మిళిత+జలధి+భంగి=జలజంతువులచేతను అలలచేతను కూడికొనిన సముద్రమువలె, అమరెన్=ఒప్పెను.

తా. శ్రీరాములు వచ్చుటవలన పురమునెల్లెడలను రథములు ఏనుఁగులు హయములు భటులు సంచరించుటయు మంగళనాదములు చెలంగుటయుఁ జూడ చంద్రుఁ డుదయింప పౌర్ణిమనాఁడు జలజంతువులతోను అలలతోను మ్రోగుచు చెలరేగి తిరుగుడువడు సముద్రమువలె నుండెను.

వి. అం. చంద్రుఁ డరుదేరఁ ఘూర్ణిల్లు అనియే చెప్పినను మొదట రాకన్ అనుపదప్రయోగము బట్టి పూర్ణచంద్రుఁడని గ్రాహ్యము.

వ. ఇట్లొప్పుచున్న యప్పురంబు ప్రవేశించి రామచంద్రుం డరుగుచున్న సమయంబున. ౬౭

ప్రవేశించి=చొచ్చి, అరుగుచున్న=పోవుచున్న.

మ. ఇతఁడే రామనరేంద్రుఁ డీ యబల కాఁ
యింద్రారి ఖండించెన
ల్లతఁడే లక్ష్మణుఁ డాతఁడే కపివరుం
డాప్రాంతవాఁడే మరు
త్సుతుఁ డా చెంగట నా విభీషణుఁ డటం
చుం జేతులన్ జూపుచున్
సతులెల్లన్ బరికించి చూచిరి పురీ
సౌధాగ్రభాగంబులన్. ౬౮

టీ. పురీ=పట్టణమునందలి, సౌధ = మేడలయొక్క, అగ్రభాగంబులన్=పైభాగములయందు, సతులెల్లన్=స్త్రీలందఱును, రామనరేంద్రుఁడు, ఇతఁడే=ఈతఁడే(అగును), ఈ యబలకున్=ఈ స్త్రీకై సీతకయి, ఆ ఇంద్రారి=

ఇంద్రునకు శత్రువైన ఆ రావణుని, ఖండించె=చంపెను. అల్ల=అదిగో, అతఁడే, లక్ష్మణుఁడు, అతఁడే, కపివరుండు=వానరశ్రేష్ఠుఁడు(రాజు) అయిన సుగ్రీవుఁడు, ఆ, పొంతవాఁడే=ప్రక్కననుండువాఁడే, మరుత్ + సుతుఁడు=వాయుకుమారుఁడు అయిన హనుమంతుఁడు, ఆ, చెంగటన్=సమీపమున,ఆ, విభీషణుఁడు, అటంచున్=అనుచు, చేతులన్, చూపుచున్, పరికించి=పరీక్షించి అనఁగా విడివిడిగా నిరూపించుకొని, చూచిరి.

తా. ఇతఁడు రామచంద్రుఁడు, ఈమె సీతాదేవి, అల్లదిగో లక్ష్మణుఁడు, అతఁడు సుగ్రీవుఁడు, ఆప్రక్కవాఁడు హనుమంతుఁడు, ఆవలివాఁడు విభీషణుఁడు అని వివేకించుకొనుచు ఒకరికొకరు చేయిజాడఁగ చూపించుకొనుచు మేడలపయినుండి అయోధ్యాపట్టణపు స్త్రీలు శ్రీరాముదులఁ జూచిరి.

వ్యా. చెంగటన్: ఇది ఔపవిభక్తికరూపము. దీనికి ప్రాతిపదికము చెంగలి.

వ. ఇట్లు జనులు చూచుచుండ రామచంద్రుండు రాజమార్గంబునం జని చని. ౭౦

టీ. సుగమము.

సీ. పటికంపు గోడలు పవడంపువాకిండ్లు
నీలంపుటరుఁగులు నెఱయఁగలిగి
కమనీయవైదూర్యక స్తంభచయముల
మరకత భూముల [1]మహిత మగుచుఁ
బడగలమాణిక్య బద్ధచేలంబులఁ
జిగురుఁదోరణములఁ జెలువుమీఱి

1. మకరతోరణముల అని పా. అం.



పుష్పదామకముల భూరివాసనలను
బహుతర ధూపదీపముల మెఱసి
మూఱువేల్పుల భంగిని మలయుచున్న
సతులుఁబురుషులు నెప్పుడు సందడింప
గుఱుతులిడరాని ధనముల కుప్పలున్న
రాజసదనంబునకు వచ్చె రామవిభుఁడు. ౭౧

టీ. పటికంపుగోడలు=స్ఫటికశిలలతోఁ గట్టఁబడినగోడలును, పవడంపువాకిండ్లు=పగడాలతో చెక్కఁబడినవాకిండ్లును,నీలంపుటరుఁగులు=నీలపురాతితో నిర్మింపఁబడిన అరుఁగులును, నెఱయ=పూర్ణముగా అనఁగా విస్తారముగా అని భావము, కలిగి, కమనీయ=మనోహరమయిన, వైదూర్యక=వైదూర్యములతో చెక్కఁబడిన, స్తంభ=కంభముల, చయ=సమూహముతోను, మరకత=పచ్చనిపఱుపుఁగల, భూములన్=నట్టిండ్లచేతను, మహితమగుచు=సంతోషింపఁజేయునదగుచు, మాణిక్యబద్ధ=రత్నములుతాపిన, చేలంబులన్=వస్త్రములుగల, పడగలన్=జండాలతోను, చిగురుతోరణములన్=(మిక్కిలి కోమలములగు) చిగుళ్లచేచేయఁబడిన తోరణములచేతను, చెలువుమీఱి=అందమతిశయించి, పుష్పదామకముల=పూలహారములయొక్క, భూరి = ఎక్కువయిన, వాసనలను=సుగంధముచేతను, బహుతర = అంతకంటె ఎక్కుడైన, ధూపదీపములన్ = ధూపములచేతను దీపములచేతను, మెఱసి=ప్రకాశించి, అనఁగా ఒప్పి యని భావము, మూఱువేల్పులభంగిని=అపరదేవతలవిధమున, మలయుచున్న=తిరుగాడుచున్న, సతులు=స్త్రీలును, పురుషులును, ఎప్పుడు = ఎడతెగక, సందడింపన్ = ఒకరినొకరు ఒరసికొని పనులుదీర్చుచుండుటచేత, గుఱుతులిడరాని=లెక్కచేయుటకురాని, ధనములకుప్పలు=ద్రవ్యపురాసులు, ఉన్న=ఉండిన అనఁగా కలిగియుండిన, రాజసదనంబునకున్ = రాచనగరుకు, రామవిభుఁడు, వచ్చెన్.

తా. స్ఫటికశిలలతో ననఁగాస్వచ్ఛమైనరాళ్లతోఁ గట్టఁబడిన గోడలును పగడములతోఁ జెక్కఁబడిన వాకిండ్లును నీలపురాతితోఁ గట్టఁబడిన యరుగులును మనోహరమయిన వైడూర్యములు చెక్కిన స్తంభములును పచ్చగ నలంకరింపఁబడిన నట్టిండ్లును ప్రేలాడఁగట్టఁబడి కొనలయందలి రత్నముల యొక్క కాంతులుగల చిఱుపతాకములును చిగుళ్లతోరణములును పూలహారములయు ధూపములయు వాసనలును దీపముల కాంతులును తమ పండువిచ్చే ఆవరణము నింపి అచ్చటి ద్రవ్యరాసుల లెక్కకురాకుండఁ జేయుచు నొప్పి అపరదేవతలఁబోలు స్త్రీపురుషులును గల రాచనగరిని శ్రీరాముఁడు చేరెను.

వి. అం. 'వీథులు సక్కఁగావించి' యనుపద్యమాదిగ నీ పద్యాంతము వఱకును కవి స్వభావసమ్మతముగ శ్రీరాముల రాకను వర్ణించి యున్నాడు. క్లుప్తముగ నొకకొన్ని ముఖ్యవిషయములఁ దడవుటచే మన కా రంగమెల్ల కన్నులఁ గట్టినట్లు వర్ణించి యున్నాఁడు. ఈపద్యమున ముఖ్యవిషయము రాచనగరు. మనముకూడ రామునితో నచటికిఁ బోవుచున్నట్లున్నది. మొదట రాజభవనమునకు వచ్చుటతోడనే అలంకృతములగు గోడలు వాకిండ్లు అరుగులు మనకు కన్పట్టుచున్నవి. గడప కడచినవెంటనే సుందరమగు కంబములు, చూడనింపగు నట్టింట్లు, దృష్టి త్రిప్ప రత్నబద్ధ పతాకములు, చిగురుతోరణములు, పూలమాలలు, దీపావళి. ఆఘ్రాణింప ధూపములు సువాసనలు. అచ్చెదువుఁ గొల్ప అపరదేవతలగు స్త్రీపురుషులు అగణ్యములగు ధనరాసులు. దీనికి వ్యాఖ్య యేల?

అయిన రచనాపటుత్వమున మాత్ర మీపద్యము పోతనామాత్యునకుం దగదు. పాదములయంతమందలి 'నెఱయఁగలిగి' 'మహితమగుచు' 'చెలువు మీఱి' 'మెఱసి' యనునవి తెచ్చిపెట్టుకొన్నట్లున్నవి గాని సహజములుగఁ గన్పట్టవు. ఇఁక 'గుఱుతు లిడరానిధనముల కుప్పలున్న' యనుపాదమెల్లయు పేలవంబుగను అన్వయ సౌకుమార్యము లేనిదిగను ఉన్నది. వృత్తము వ్రాసి



యుండిన నింతకంటె బాగుండి యుండుననిఁ దోఁచెడి. ఒకవేళ ఖిలమైన భాగంబు పూరించుచోడ నితరు లీపద్యంబున కీగతి కల్పించి యుండిన నుండనగు.

వ. ఇట్లు వచ్చి. ౭౧

ఉ. తల్లుల కెల్ల మ్రొక్కి తమ
తల్లికి వందన మాచరించి య
ల్లల్ల బుధాళికిన్ వినతుఁ
డై చెలికాండ్రను దమ్ములం బ్రసం
ఫుల్లతఁ గౌఁగిలించుకొని
భూవరుఁ డోలి కృపారసంబు రం
జిల్లఁగఁ జాలమన్ననలు
సేసె నమాత్యులఁ బూర్వభృత్యులన్. ౭౨

టీ. తల్లులకు, ఎల్లన్=అందఱకు, మ్రొక్కి = నమస్కారముచేసి, తమ, తల్లికి, వందనము, ఆచరించి=చేసి, అల్లల్లన్=వరుసఁగా, బుధాళికిన్=పండితసమూహమునకు, వినతుఁడై=విధేయత చూపి, చెలికాండ్రను=స్నేహితులను, తమ్ములన్=తమ్ములను, ప్రసంఫుల్లతన్= మిక్కిలి సంతోషముతో, కౌఁగిలించుకొని, కృపారసంబు=దయారసము, రంజిల్లఁగన్= పెంపుపొందునట్లు, భూవరుఁడు=శ్రీరాముఁడు, ఓలి=వరుసగా, అమాత్యులన్ = మంత్రులను, పూర్వభృత్యులన్=మునుపటి సేవకులను, చాల=ఎక్కువగ, మన్ననలు చేసె=గౌరవించెను.

తా. శ్రీరాముఁడు మొదట తనసవతితల్లుల కందఱకు నమస్కారము గావించి తమతల్లికి మ్రొక్కి పెద్దలకు ఎఱఁగి స్నేహితులను తమ్ములను ప్రేమ

తోఁ గౌఁగిలించుకొని మంత్రులను సేవకులను దయామయము లయిన వీక్షణము లతోఁ జూచి గౌరవించెను.

వి. అం. 'తల్లుల కెల్ల మ్రొక్కి తమతల్లికి వందనమాచరించి' యనుచోఁ దమతల్లికి ననివర్ణించుట యోచింపవలసి యున్నది. శ్రీరామునితల్లి కౌసల్య. లక్ష్మణునితల్లి సుమిత్ర. భరతశత్రుఘ్నుల తల్లి కైకేయి, శ్రీరాముఁడు భార్యను తమ్ముని వెంటఁగొనియే కైకేయి సుమిత్రలకు ప్రణమిల్లెను. ఈ విషయము ముందుపద్యమున సూచింపఁబడియే యున్నది. తరువాత వీరు మువ్వురును కౌసల్యకడకుం జనిరి. ఆయమ రామునికిఁ గన్నతల్లి, లక్ష్మణునకు సవతితల్లి, సీతకు అత్తయగుటచే తల్లిస్థానమున నుండునది. కాన ఇట 'తమతల్లి' యని వర్ణించుటలో విపరీతము లేదు, సీతారామలక్ష్మణులు మువ్వురును ఒక్కటిగ దుఃఖంబును సుఖంబును అనుభవించుటచేతను వారివిషయమున కౌసల్యకు సమానానురాగ మని సూచించుటకుఁ గూడ నీ 'తమతల్లి' యనుప్రయోగము తగి యున్నది.

క. తత్సమయంబునఁ దల్లులు[1] ౨౩

చ. కొడుకులుఁ బెద్దకోడలును
గొబ్బున మ్రొక్కిన నెత్తి చేతులం
బుడుకుచు మోములుం దలలు
బోరున ముద్దులుగొంచు నవ్వుచున్
దొడలకు వారి రాఁదిగిచి
తోఁగఁగఁ జేసిరి నేత్రధారలన్

1. కౌసల్యాదులైన మాతలు అని పా, అం.



వెడలినప్రాణముల్ దగఁ బ్ర
విష్టము లయ్యె నటంచు నుబ్బుచున్ ౨౪

టీ. కొడుకులును, పెద్దకోడలును, గొబ్బునన్=శీఘ్రముగా, మ్రొక్కినన్, ఎత్తి, చేతులను, పుడుకుచు = గ్రహించుచు, మోములును, తలలును, బోరునన్=అధికముగ, ముద్దులుగొంచు=ముద్దిడుచు, నవ్వుచున్=సంతోషముచేత చిఱునగవంకురింపనని యర్థము, వారిన్=కొడుకులను కోడలిని, తొడలకు రాఁదిగిచి=తొడపైకివచ్చునట్లులాగి అనఁగా తొడలపైనిడికొని, వెడలిన ప్రాణముల్=పోయిన ప్రాణములు, తగన్=ఉచితరీతిని, ప్రవిష్టము లయ్యెను=మఱల ప్రవేశించెను, అటంచు, ఉబ్బుచున్=సంతోషించుచు, నేత్ర ధారలన్=కండ్లనుండిజారు ధారలచేత అనఁగా సంతోషాశ్రువులచే, తోఁగఁగన్=తడియునట్లు, చేసిరి.

తా. శ్రీరాముఁడును, లక్ష్మణుఁడును, సీతాదేవియు మ్రొక్కఁగా పోయిన ప్రాణములు మరల వచ్చినట్లు తల్లులు సంతోషించి వీరిని ఆలింగన మూర్ధఘ్రాణాదులచే స్వీకరించి తొడలపైనిడుకొని సంతోషాశ్రువుల విడిచిరి.

వ. అంత వసిష్ఠుండు శ్రీరామచంద్రుని జటాబంధంబు విడిపించి కులవృద్ధులుం దానును సమంత్రకంబుగ దేవేంద్రుని మంగళస్నానంబు సేయించు బృహస్పతిచందంబున సముద్రనదీ జలంబుల నభిషేకంబు సేయించె. రఘువరుండును సీతాసమేతుండై జలకంబులాడి మంచిపుట్టంబులు గట్టికొని కమ్మని పువ్వులు దుఱిమి సుగంధంబు లలందికొని తొడవులు దొడిగికొని తనకు భరతుండు సమర్పిం

చిన రాజసింహాస నంబునం గూర్చుండి యితని మన్నించి
కౌసల్యకుఁ బ్రియంబు సేయుచు జగత్పూజ్యంబుగ రా
జ్యంబు సేయుచుండె నప్పుడు.

టీ. జటాబంధంబుల్ = జడలముడిని, కులవృద్ధులున్ = (శ్రీరాముని) వంశములోని పెద్దలును, సముద్ర నదీజలంబులన్ = సముద్రములయొక్కయు నదులయొక్కయు నీళ్ళచేత, జలకంబులాడి = స్నానము చేసి (నీళ్లాడితయనుపద మునకును వ్యుత్పత్తి నిదియే యర్థము), పుట్టంబులు = వస్త్రములు, కమ్మని = సువాసనగల, తుఱిమి = ముడిచి, సుగంధంబులు = వాసనద్రవ్యములు, అలంది కొని = పూసికొని, తొడవులు = నగలు, సమర్పించిన = నివేదించిన, కౌసల్యకు, ప్రియంబు, సేయుచు = ప్రీతికలిగించుచు, జగత్పూజ్యంబుగ = లోకమునకు పూజింపఁదగినవిధమున, రాజ్యంబు సేయుచుండెన్, అప్పుడు.

తా. సుగమము.

వి. అం. సమంత్రకంబుగ నని చెప్పబోవుచు 'కులవృద్ధులుం' గానును (వసిష్ఠుఁడును) అభిషేకము సేయించెను అని వ్రాయుట పూర్ణప్రయోజనము లేని వ్రాతఁగం దోపవచ్చును. కాని బృహస్పతి దేవేంద్రుని మంగళస్నానంబు చేయించు విధమున అను ఉపమానము దెచ్చి వర్ణించుటంబట్టి ఇట కులవృద్ధుల కును దేవతలకును, దేవేంద్రునకు శ్రీరామునకును ఉపమానము ధ్వనివలన స్ఫురించుచున్నది. తద్వారా దేవేంద్రవైభవము సూచితమయి ఆహ్లాద కొసఁగు చున్నది.

సీ. కలఁగుటెల్లను మానెఁ గంధు లేడింటికిఁ
జలనంబు మానె భూచక్రమునకు
జాగరూకత మానె జలజలోచనునకు
దీనభావము మానె దిక్పతులకు
మాసియుండుట మానె మార్తాండవిధులకుఁ
గావిరి మానె దిగ్గగనములకు
నుడిగిపోవుట మానె నుర్వీరుహంబుల
కడఁగుట మానెఁ ద్రేతాగ్నులకును

గడిఁది వ్రేగు మానెఁ గరి గిరి కిటి నాగ
కమఠములకుఁ బ్రజలకలఁక మానె
రామచంద్ర విభుఁడు రాజేంద్రరత్నంబు
ధరణి భరణరేఖఁ దాల్చునపుడు. ౭౬

టీ. రాజ + ఇంద్ర + రత్నంబు = రాజశ్రేష్ఠులలో శ్రేష్ఠుఁడయిన వాఁడు, రామచంద్రవిభుఁడు, ధరణి = భూమియొక్క, భరణ = వహించుటయొక్క, రేఖ = సంపూర్ణత్వమును, తాల్చునపుడు = నిర్వహించు నప్పుడు, కంధులు = సముద్రములును, ఏడింటికి, కలఁగుట = సంక్షోభపడుట ఎల్లయు = అంతయు, మానెను, భూచక్రమునకు = భూమికి, చలనంబు కంపము, మానెను, జలజలోచనునకు = కమలాక్షునకు విష్ణువునకు, జాగరూకత = మేల్కొని యుండుట, మానెను, దిక్పతులకు = దిక్కులకు అధిపతులగు దేవతలకు, దీనభావము = దైన్యము, మానెను, మార్తాండవిధులకు = సూర్యచంద్రులకు, మాసియుండుట = తేజముచెడియుండుట, మానెను, దిగ్గగనములకు = దిక్కులకును ఆకాశమునకును అనఁగా వాతావరణమునకును, కావిరి = నలుపు అనఁగా మాంద్యము, మానెను, ఉర్వీరుహంబులకు = చెట్లకు, ఉడిగిపోవుట, = గొడ్డుపోవుట మానెను, త్రేతాగ్నులకును = మూఁడగ్నులకును, అడఁగిపోవుట = ఆఱిపోవుట, మానెను, కరిగిరికిటినాగ

కమఠములకు = అష్టదిగ్గజములు, కులపర్వతములు, ఆదివరాహము, ఆదిశేషుఁడు, ఆదికూర్మము వీనికి, కడిఁది=ఎక్కువయైన, ఱ్ఱేఁగు = బరువు మానెను, ప్రజల = భూజనులయొక్క, కలఁక = కష్టము, మానెను.

తా॥ శ్రీరాముఁడు భూభారము దాల్చియుండ సముద్రములు కలగుండుపడుటయు భూమి కంపమందుటయు సంభవింపవయ్యెను. విష్ణుదేవుఁడు లోకమును పోషింపవలెనే యను చింత వదలి ఆపనిని శ్రీరామునకు నిచ్చినమ్మది కనెను. దిక్పాలకులు రాక్షసులభయము లేక హైన్యముమాని తలలెత్తికొనిరి. అదేవిధముగ సూర్యచంద్రులు తేజోవంతులయి వెలిఁగిరి. దిక్కులును వాతావరణమును జడిమ మాని తేలికయై ఉల్లాసమిచ్చుచుండె. వృక్షములు సర్వదా ఫలించుచుండె. (యజ్ఞములు దండిగజరుగుటచే) అగ్ని సదాతృప్తుఁడై వెలుఁగుచుండె. అష్టదిగ్గజములకును, కులపర్వతములకును ఆదివరాహమునకును ఆదికూర్మమునకును ఆదిశేషునకును బరువు తగ్గెను. భూజనులు చింతలు లేక సుఖంబుండిరి.

వి. అం. ఈపద్యమునం దుత్తమప్రకృతిగల రాజుపరిపాలన వర్ణితము. ఇది చదువునెడ నిట్టిస్థితికి వ్యతిరేకంబయిన "ఎండగాయవెఱచు..." అను నిందలి పద్యంబును ఉత్పాతస్థితిని వర్ణించుచుచు తిక్కన వ్రాసిన

మ. కలఁగెం దోయధిసప్తకంబు గిరివర్గంబెల్ల మాటాడె సం
చలతం బొందె వసుంధరావలయ మాశాచక్ర మల్లాడెఁ గొం
దలమందెం ద్రిదశేంద్రు పట్టణము పాతాళంబు ఘూర్ణిల్లెనా
కులమయ్యెం గ్రహ తారకావలము సంక్షోభించె నవ్వేళయుక్

అను పద్యమును తలఁపునకు రాకపోదు.



సప్తసముద్రములు:—లవణ సముద్రము, ఇక్షు సముద్రము, సురాసముద్రము, సర్పి సముద్రము, దధి సముద్రము, క్షీర సముద్రము, జలసముద్రము.

అష్టదిక్పతులు:—ఇంద్రుఁడు, అగ్ని, యముఁడు, నైరుతి, వరుణుఁడు, వాయువు, కుబేరుఁడు, ఈశ్వరుఁడు వీరు వరుసగా తూర్పు, ఆగ్నేయము, దక్షిణము, నైఋతి, పడమర, వాయవ్యము, ఉత్తరము, ఈశాన్యము అను దిక్కులకు నాయకులు.

చదువరులు జ్ఞాపకముంచుకొనుట క్రిందిశ్లోకమును పఠింపవచ్చును.
ఇంద్రోవహ్నిః పితృపతిః నైఋతో వరుణో మరుత్
కుబేర ఈశః పతయః పూర్వాదీనాం దిశాంక్రమాత్.
త్రేతాగ్నులు.—ఆహవనీయము, గార్హపత్యము, దక్షిణాగ్ని.

ఆహవనీయాగ్ని యనునది ఎప్పుడును తేజోవంతముగ నుండు గార్హపత్యమునుండి కొనిపోఁబడి యజ్ఞాదులయందు నుపయోగింపఁబడు అగ్ని. (ఆహవము అనఁగా యజ్ఞము.)

గార్హపత్యము. వంశ పరంపరగ వచ్చుచు గృహస్థుచే నెల్లప్పుడును ప్రజ్వలితమగుచు నతనిచే నతని అపత్యమునకు (సంతతికి) ఈయఁబడు అగ్ని గార్హపత్యము.

దక్షిణాగ్ని. యజ్ఞాదుల వేదికి దక్షిణమున నిడఁబడు అగ్ని.

అష్టదిగ్గజములు.—అభ్రము, కపిలము, పింగళము, అనుపమము, తామ్రకర్ణము, శుభ్రదంతము, అంజనావతి.

కులపర్వతములు.—౨౫ వ పుట చూడు.

అష్టదిగ్గజములును, సప్తశైలములును, ఆదివరాహమును, ఆదిశేషుఁడును, ఆదికూర్మమును భూమిని మోయుచుండు నని పురాణములు.

వ. మఱియును. ౭౭

సీ. పొలఁతులవాలుచూపుల యందె చాంచల్య
మబలల నడుముల యందె లేమి
కాంతాలకములందె కౌటిల్యసంచార
మతివల నడపుల యందె జడిమ
ముగుదల పరిరంభములయందె పీడన
మంగనా కుచముల యందె పొగరు
పడఁతుల గతులందె బంధసద్భావంబు
సతులఁ బాయుట లందె సంజ్వరంబు

ప్రియులు ప్రియురాండ్ర మనముల బెరసి తార్చు
టందె చౌర్యంబు వల్లభు లాత్మసతుల
నాఁగి క్రొమ్ముళ్లు పట్టుటం దక్రమంబు
రామచంద్రుండు పాలించు రాజ్యమందు.[1] ౭౮

టీ. రామచంద్రుండు, పాలించు=ఏలు, రాజ్యమందు, పొలఁతుల=స్త్రీలయొక్క, వాలుచూపుల్యందె = ఓరచూపులయందే, చాంచల్యము = కదలుటలు (చంచలత్వము), అబలల=స్త్రీలయొక్క, నడుములయందే,లేమి= లేకయుండుట (దారిద్ర్యము), కాంత=స్త్రీలయొక్క, అలకములందె=ముంగురులయందే, కౌటిల్యసంచారము = వంకరటింకర నడకలు (కౌటిల్యము, మోసము), అతివల=స్త్రీలయొక్క, నడపులయందే=నడకలయందే, జడిమ= మాంద్యము, ముగుదల = స్త్రీలయొక్క, పరిరంభములయందె = కౌగిలింతలయందే, పీడనము = పెదవుటలు (పీడించుటలు), అంగనా= స్త్రీలయొక్క, కుచములయందె = స్తనములయందే, పొగరు = నిక్కుపాటు, పడఁతుల = స్త్రీలయొక్క, గతులందే, బంధసంధానంబు = బంధములయొక్క కూడిక (కారాగృహాది రూపములైన నిర్బంధములయొక్క కూడిక), సతులన్ = (తమతమ) స్త్రీలను, పాయుటలందె=వీడుపడుటలందే,సంజ్వరంబు=తాపము, ప్రియులు ప్రియురాండ్ర మనముల, బెరసి = కలసి, తార్చుటందె = ప్రేరేపించుటయందే, చౌర్యము=ఏమార్చుట (దొంగతనము), వల్లభులు=మగఁడ్లు, ఆత్మసతుల = తమభార్యలను, ఆఁగి = ఆఁపి, క్రొమ్ముళ్ళు = క్రొత్తలు క్రొత్తలుగఁ దీర్చినకొప్పులను, పట్టుట + అందు = పట్టుటయనుపనియందు, అక్రమంబు=క్రమము తప్పుట (అన్యాయము).

తా. శ్రీరాముని రాజ్యమునందు చంచలత్వము, దారిద్ర్యము, మోసము, మాంద్యము, పీడ, పొగరు, కారాగృహాదిశిక్షలు, తాపము, దొంగతనము, అక్రమములు మున్నగుబాధలు లేకుండెను.

వి. అఁ. పైవిషయమును కవి ఈపద్యమున శృంగారరసముఁ జొప్పించి వర్ణించి యున్నాఁడు.

క. తండ్రిక్రియ రామచంద్రుఁడు
తండ్రుల మఱపించి ప్రజలఁదా రక్షింపన్
తండ్రుల నందఱు మఱచిరి
తండ్రి గదా రామచంద్ర ధరణీపుఁ డనుచున్[1] ౭౯

1. రఘువరేణ్యుండు శాసించు రాజ్యమునందు అని పా. అం.

1. రామ ధరణి దయింతుడనుచున్ పా. అం.

టీ. రామచంద్రుఁడు, తండ్రికిఁబలె = తండ్రివలె, తండ్రులన్, మఱపించి, ప్రజలన్ = జనులను, తాన్ = తాను, రక్షింపన్ = సంరక్షింపఁగా, రామచంద్ర ధరణిపుఁడు, తండ్రి, కదా = కాదా (అవును అనుట) అని, తండ్రిలన్, అందఱు, మఱచిరి.

తా. రాముఁడు తండ్రివలె రాజ్యముచేయుటచేత ప్రజలు తమకందఱికిని తండ్రిస్థానమున నున్న అతనినే గలయనురాగ మేముఖ్యముగఁ దలంచుచు తమ కన్నతండ్రులయెడ గూడ అంత ప్రేమ చూపకుండిరి

వి. అం. ఇందు ఎట్టిరాజు ఉత్తముఁడనుట సూచితము

వ. మఱియు నా రామచంద్రుండు రాజర్షి చరితుండును నిజధర్మ
నిరతుండును నేకపత్నీవ్రతుండును సర్వలోక సమ్మతుండును
నగుచు ధర్మవిరోధంబు గాకుండఁ గోరిక లనుభవించుచుఁ
ద్రేతాయుగంబైనఁ గృతయుగధర్మంబు గావించుచు బాల
మరణంబు మొదలగు నరిష్టంబులు ప్రజలకుఁ గలుగకుండ
రాజ్యంబు సేయుచుండె నయ్యెడ. ౮౦

టీ. మఱియు, ఆ, రామచంద్రుడు, రాజర్షి చరితుండును = రాజఋషి యొక్క నడవడిక కలవాఁడును, నిజ = తనయొక్క, ధర్మ = ధర్మమునందు అనఁగా తనకుఁ గర్తవ్యము లగు పనులయందు, నిరతుండును = ఆసక్తిగలవాడును, ఏకపత్నీవ్రతుండును = ఒక్కతే భార్యయందు ప్రేమగలవాఁడును, సర్వలోకసమ్మతుండును = జనులందఱి యంగీకారము నందినవాఁడును, అగుచు, ధర్మవిరోధంబు గాకుండ = న్యాయపరిపాలనకు అడ్డురానివిధమున, కోరికలు, (సుఖములు), అనుభవించుచు, త్రేతాయుగంబు, ఐనన్ = అయి



నను, కృతయుగ ధర్మంబు, కావించుచు = చేయుచు, బాలమరణంబు = శిశుహత్య, మొదలగు, అరిష్టంబులు = బాధలు, ప్రజలకు, కలుగకుండ, రాజ్యంబు, చేయుచుండె, అయ్యెడన్.

వి. అం. దేవర్షి, బ్రహ్మర్షి, రాజర్షి అని ఋషులు మూఁడు తెఱంగులు. రాజులుగ నుండి తమచరిత్రమువలన ఋషితుల్యు లయి పేరుగనువారు రాజర్షులు. వారు సత్త్వగుణ సంపన్నులు. జనక మహారాజు శ్రీరాములు మున్నగువారు.

ఏకపత్నీవ్రతుఁడు అను వర్ణనను ఆ రాములవారి సంతతివారమే యని చెప్పుకొనుచుఁ దమ నగరులను సంఖ్యలేని భార్యలతోను దాసీజనములతోను నింపుచుండు ప్రభునామధేయులు చక్కఁగ వల్లించి శ్రేయస్సునందుదురుగాక.

ధర్మవిరోధంబు గాకుండఁ గోరిక లనుభవించుచు ననునెడ కాళిదాసు రఘువంశమునందలి

'శైశవేభ్యస్తవిద్యానాం యౌవనే విషయైషిణాం'

అను మొదలగు ఘట్టము చదువరులకుఁ దట్టక మానదు.

యుగములు నాలుగు: కృతయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగము, కలియుగము. ఇందు

| | పరిమితి | |
|---|---|---|
| కృతయుగము | 17,28,000 | సంవత్సరములు |
| త్రేతాయుగము | 12,96,000 | ,, |
| ద్వాపరయుగము | 8,64,000 | ,, |
| కలియుగము | 4,32,000 | ,, |

ఈపరిమితివలెనే సర్వధర్మములును క్షీణించుచు వచ్చునని పౌరాణికుల వాడుక. కృతయుగమున ధర్మము పూర్ణమైయుండుననియు త్రేతాయుగమున నొకపాతిక తగ్గుననియు ద్వాపరయుగమున ధర్మమున నర్ధమే జరుగుననియు కలియుగమున ధర్మమొక్కపాదముపైనే నిలుచుననియు ప్రతీతి. శ్రీరాములవారు త్రేతాయుగమున నుండినవారని భాగవతము. త్రేతాయుగమున ధర్మము ఒక్కపాతిక కొఱవడవలసి యున్నను రామరాజ్యమున కృతయుగమందువలె ధర్మము సంపూర్ణముగ జరుగుచుండె నని చరిత్ర.

ఆ. సిగ్గు వడుట గల్గి సింగారమును గల్గి
భక్తిగల్గి చాల భయముఁ గలిగి
నయముఁ బ్రియముఁ గలిగి నరనాథుచిత్తంబు
సీత దనకు వశము చేసికొనియె. ౮౧

టీ. సిగ్గువడుట= నాణ్యత అనఁగా స్తుత్యాదులు వినినప్పుడు సంకోచపడుస్వభావము, కల్గి = కలిగినదయి, సింగారమును = ఉచితరీతిని అలంకృతయయియుండుట, కల్గి, భక్తి, కల్గి, చాల = ఎక్కువైన, భయముఁ = విధేయతయు, కల్గి, నయముఁ = సాధుత్వమును, ప్రియముఁ = ప్రేమయును, కల్గి, సీత, నరనాథుచిత్తంబుఁ = రాజుయొక్క అనఁగా రామునియొక్క మనస్సును, తనకు, వశముచేసికొనియె = లోఁబఱచుకొనియె.

తా. సీతాదేవి స్త్రీలకుండఁ దగిన నాణ్యత, మట్టసము, భక్తి, విధేయత, సాధుత్వము, ప్రేమ మున్నగు సద్గుణములు కల దయి ప్రవర్తించుచు మెలఁగి శ్రీరామునిమనసున కెక్కెను.



వి. అం. ఈపద్యమునందు పోతనామాత్యుఁ డుపయోగించినపదములు మిక్కిలి సులభములై కనబడినను అందలిభావములు మాత్ర మంతశీఘ్రముగ గోచరించునవి గావు. సిగ్గువడుట యనుటతోడనె మనస్త్రీలె జ్ఞాపకమునకు వచ్చి పురుషులను జూచిన పాఱిపోవుటయని యర్థముచేసికొందుము. అయిన అంతమాత్రమున నిందలి యర్థము ముగియదు. అది ఇందలియర్థము కాదనియే చెప్పవచ్చును. ఏల యన, సీతాదేవియెల్లకష్టములయందును' ఎల్లసుఖములయందును శ్రీరామునితో నుండి వేనవేలుకార్యముల బహిరంగముగ నొనర్చినది. కావున నిట సిగ్గు గలిగి యనుటకు ఈపారిపోవుటకంటె వేరొక యర్థ ముండవలయును. తనసంపత్తునో, తనభాగ్యమునో, తనసుగుణములనో, తనసౌందర్యమునో ఇతరులు పొగడినప్పుడు విజృంభింపక అట్టిపొగడ్తలకు నేను దగుదునాయను తత్క్షణజనితసంకోచమువలన నగు చిత్తవికారమే ఈసిగ్గువడుట? పరపురుషులఁ జూచిన స్వాభావికముగ నొదుగుటయు ఇట్టి చిత్తవికారంబులలో నొక్కటి యగుట నీసిగ్గువడుటలోఁ జేరుచున్నది.

'సింగారమును' గల్గి యనుట తోడనె మనకు మితిమీరిన బంగరుకుప్పలు మనోగోచరములగును. ఒకవేళ నవనాగరికము సేర్చిన స్త్రీలకు మిక్కిలి విలువగల రత్నములో అవి దూరమైన రాళ్లో పైకొనుటకు ఏదేశమునుండియో వచ్చిన ఈఁకలో స్ఫురింపవచ్చును. ఇది యెల్లయు నభ్యాసదోషము. ఒకప్పుడు దేహమునకు బ్రేఁగగునట్లు ఆభరణాదుల ధరించి బంగారపు ముద్దలవలె కన్పించుటయు మఱియొకప్పుడు చింపిరిగుడ్డలు చీమిడిముక్కును నైభీభత్సరసోత్పాదకులగుటయు ఇప్పటికాలపు సాధారణ నారీమణులవాడుక. అట్లుగాక బంగారమును రత్నములును ఉన్నను లేకున్నను ఎల్లప్పుడును భర్తకును కుటుంబమునకును ఉల్లాసముకలిగించువిధమున మట్టసముగ నలంకారము చేసికొని వికసితముఖంబులతో నుండుటయే సీతాదేవియొక్క సింగారము.

భక్తి యనఁగా మనకు సర్వసాధారణముగ దేవాలయములే జ్ఞప్తికి వచ్చును. కాని ఈపదమునకర్థము అనురాగమువలన జనించుగౌరవము. ఇట్టి అనురాగగౌరవములుసృష్టికర్తయగు పరమాత్మునియెడను సర్వసృష్టియెడను సీతాదేవికిఁ గలదని యర్థము.

చాలభయము అనుటతోనె పూర్ణభీరుత్వమని యర్థము రానోపు. అయిన సీతభీరుత్వముకలది కాదనుటకు ఆమె చరిత్రయే సాక్షి. ఇక్కడ భయమనుటకు విధేయత యని యర్థము.

ఇందు వర్ణితము లయినగుణములు కొంచె మించుమించుగ స్త్రీపురుషులందఱకుఁ జెల్లునవే యనుట గమనింపవలెను.

వ. అనిన విని పరీక్షిన్న రేంద్రుం డి ట్లనియె. ౮౨

ఆ. భ్రాతృజనులయందు బంధువులందును
ప్రజలయందు రాజభావ మొంది
యెట్లు మెలఁగె రాఘవేశ్వరుం డెవ్వనిఁ
గూర్చి క్రతువు లెట్లుగోరిచేసె. ౮౩

టీ. భ్రాతృజనులయందు = సోదరజనులయందును, బంధువులందును, ప్రజలయందును, రాజభావము = రాచరికము, ఒంది = వహించి, రాఘవేశ్వరుండు, ఎట్లుమెలఁగె = ఏప్రకారముగా ప్రవర్తించెను, కోరి = పూని, ఎవ్వనిఁగూర్చి = ఎవ్వరికొఱకు, క్రతువులు = యజ్ఞములు, ఎట్లు చేసెను.

తా. శ్రీరాముఁడు సోదరులకును, బంధువులకును, ప్రజలకును రాజుగదా! అందఱియెడల నతఁడెట్లు ప్రవర్తించెను. ఏమేమియజ్ఞములు ఎట్లెట్లు చేసెను?



వ. అనిన శుకుం డిట్లనియె. ౮౪

కథ. శుకుఁడు వ్యాసమహర్షి కుమారుఁడు. ఘృతాచి యను అప్సరస భూలోకంబున శుకాకృతిమయి దిరుగుచుండ ఆమెం గాంచినంతనే వ్యాసునకు వీర్యస్ఖలనంబయ్యెనఁట. శుకుండు కలిగెనఁట. ఈకథ ఎట్లున్నను శుకుఁడు మాత్రము శుద్ధబ్రహ్మచర్యంబునకు పేరువడసినవాఁడు. ఇతఁడు నగ్నుఁడై తిరుగుచుండినను స్త్రీలు లజ్జగొననంతటి నిష్ఠాగరిష్ఠుఁడు. అట్టి ఈశుకుఁడు భాగవతపురాణంబును ప్రాయోపవిష్టుం డైన పరీక్షిన్న రేంద్రునకుం జెప్పెను.

సీ. భగవంతుఁ డగు రామభద్రుండు ప్రీతితో
దేవోత్తముని సర్వదేవమయునిఁ
దనుఁ దాన కూర్చి యధ్వరములు సేసెను
హోతకుఁ దూరుపు నుత్తరంబు

సామగాయకునికి శమనదిగ్భాగంబు
బ్రహ్మకుఁ గ్రమమునఁ బడమ రెల్ల
అధ్వర్యునకు శేష మాచార్యునకు నిచ్చి
సొమ్ములఁ బంచి భూసురుల కొసఁగి

తనకు రెండు పుట్టంబులుఁ దనకునయిన
మెలఁత మంగళసూత్రంబు మినుకుఁ దక్క-
వినతుఁ డై యుండె నారాము వితరణంబు
పాండవోత్తమ యే మని పలుకవచ్చు. ౮౫

టీ. భగవంతుఁడు, అగు, రామభద్రుండు, ప్రీతితో, దేవోత్తముని దేవులలోనుత్తముని, సర్వదేవమయుని = అందఱు దేవతలతో నిండినవానిని అనఁగా అందఱు దేవతలు తానే అయినవానిని, తను = తన్ను, తాన = తానే, కూర్చి = ఉద్దేశించి, అధ్వరములు = యజ్ఞములు, చేసెను, (అందు), హోతకు = యజ్ఞమున ఋగ్వేదమంత్రముల పఠించువానికి, తూరుపు = తూర్పు సీమయు, సామగాయకునికి = సామవేదము పాడునతనికి, ఉత్తరంబు = ఉత్తరసీమయు, బ్రహ్మకు = యజ్ఞతంత్రమును నడుపువానికి, శమనదిగ్భాగంబు = యమునిదిక్కు అనఁగా దక్షిణసీమ, అధ్వర్యునకు = వేదిక, ఉపకరణములు, సమిధలు, పశువు మున్నగు యజ్ఞసామగ్రిని సమకూర్చి యజుర్వేదమును పాడునట్టివానికి, క్రమమున = అనఁగా పైన చెప్పినవరుస ననుసరించి యనుట, పడమర = పశ్చిమసీమ, ఎల్లను = అంతయు, ఆచార్యునకు = పురోహితునకు, శేషము = తక్కుంగలది అనఁగా మధ్యసీమ, ఇచ్చి = దానముచేసి, సొమ్ములన్ = భూషణములను, భూసురులకు = బ్రాహ్మణులకు ఇతరబ్రాహ్మణులకని భావము. పంచి, ఒసఁగి = ఇచ్చి, తనదు = తనయొక్క, రెండుపుట్టంబులు = రెండుదోవతులు (మాత్రమనుట), తనకున్, అయిన = కాఁగా, మెలఁత = స్త్రీ యొక్క ఇట భార్యయగు సీతాదేవియొక్క, మంగళసూత్రంబున్ = మంగళసూత్రమును, మినుకు = తాళిబొట్టును, తక్క = మిగిలియుండఁగా, వినతుఁడు = నమస్కరించినవాఁడు, అయి, ఉండెన్, ఆ రాము వితరణంబున్ = (అట్టి) ఆశ్రీరాముని ఔదార్యము, పాండవోత్తమ = పాండవులలో శ్రేష్ఠుఁడా అనఁగా పరీక్షున్మహారాజా యనుట, ఏమి + అని + పలుకవచ్చు = ఎట్లని నుడువవచ్చు అనఁగా నుడువరానంత యని.

తా. శ్రీరాములవారు యజ్ఞములు చేసి తనకుఁగల సర్వస్వము దానము చేసి తనకట్టుగుడ్డలతోను తనభార్యమంగళసూత్రముతోను నిలిచెను.



క. అంత నా రామచంద్రుని దానశీలత్వంబునకు మెచ్చి విప్ర
వరులు దమతమభూములు మఱల నిచ్చి యిట్లనిరి. ౮౬

టీ. దానశీలత్వంబునకు = ఉదారణగుణంబునకు, విప్రవరులు = బ్రాహ్మణశ్రేష్ఠులు.

తా. సుగమము.

ఆ. ధరణి వలదు మాకుఁ దపసుల కేల నీ
వఖిలలోకగురుఁడ వైన హరివి
మా మనంబులందు మలయు చీఁకటిఁ బాపు
భవదుదార రుచులఁ బార్థివేంద్ర. ౮౭

టీ. మాకు, ధరణి = భూమి, వలదు = వద్దు, తపసులకు, ఏల = ఎందుకు, (అక్కఱ లేదనుట), నీవు అఖిలలోకగురుఁడవు = అన్నిలోకములకు గురువవు, అయిన, హరివి, భవదుదారరుచుల = నీయొక్క గొప్పదైన తేజస్సుచేత, పార్థివేంద్ర = ఓరాజశ్రేష్ఠా రామా, మా, మనంబులందు, మలయు = సుడివడుచుండు అనఁగా తిరుగు, చీఁకటి = అంధకారమును అనఁగా అజ్ఞానమును, పాపు = పోఁగొట్టుము.

తా. మాకు రాజ్యభాగములు అక్కఱ లేదు. నీవు సర్వలోకంబులకును ఉపదేశకుఁడ వైనపరమాత్మవు. కావున మాయజ్ఞానమును నీతేజస్సుచే ఖండించి మమ్మును జ్ఞానవంతులఁ జేయుము. ఇది గాక తపసుల మగుమాకు రాజ్యము లేల?

వి. అం. శ్రీరాముని యట్టిదాతలును రాజ్యములు దమంతట వచ్చిచేరినను జ్ఞానమునకయి వానిం దృణీకరించు బ్రాహ్మణులును ఉండిన నిఁ కేమి తక్కువ?

వ. అని పలికి బ్రహ్మణ్యదేవుం డైనరామచంద్రుని వినయోక్తు
లం బూజించి మునులు చనిరి యిట్లు పెద్దకాలంబు రాజ్యం
బు చేసి రాఘవేంద్రుం డొక్కదినంబున. ౮౮

టీ. బ్రహ్మణ్యదేవుండు=బ్రాహ్మణులకు దేవుఁడు, వినయోక్తులన్ = వినయంపుమాటలన్, పెద్దకాలంబు=చాలాకాలము.

సీ. వసుధపైఁ బుట్టెడు వార్తలాకర్ణించు
కోఱకునై రాముఁడు గూఢవృత్తి
నడురేయిఁ దిరుగుచో నాగర జనులలో
నొక్కఁడు దనసతి యొప్పకున్న
నొరునింటఁ గాఁపురం బున్నచంచలురాలిఁ
బాయంగలేక చేపట్ట నేమి
తా వెఱ్ఱి యగు రామధరణీశ్వరుండ నే?
బేల పొమ్మను మాట బిట్టు వలుక

నాలకించి మఱియు నామాట చారుల
వలన జగములోనఁ గలుగఁ దెలిసి
సీత నిద్రవోవఁ జెప్పక వాల్మీకి
పర్ణశాలఁ బెట్టఁ బనిచె రాత్రి. ౮౯

టీక. రాముండు, వసుధపై = భూమిమీఁద అనఁగా ఇచ్చట తన రాజ్యమునందు, పుట్టు, వార్తలు=సమాచారములు, ఆకర్ణించుకొఱకునై = వినుటకుఁగాను, నడురేయి=మధ్యరాత్రమున, తిరుగుచో = తిరుగునప్పుడు



నాగర = నగరమునందలి అనఁగా అయోధ్యా పట్టణమందలి, జనులలో ఒక్కఁడు, తనసతి=తనభార్య, ఒప్పకున్న = చక్కపడకున్న అనఁగా కుటిల యై యుండుటచేత, "ఒరుని = మఱియొకని, ఇంటన్, కాఁపురము, ఉన్న, చంచలురాలిన్ = చంచలచిత్తముగల భార్యను, పాయంగలేక = (మమతచే) విడువలేక, చేపట్టన్ = స్వీకరించుటకు, తాను, వెఱ్ఱి, అగు రామధరణీశ్వరుండ నే = రామచంద్రుఁడనా, ఏమి (కాననుట), బేల=ముగ్ధ పొమ్మ" అను మాట, బిట్టు=కఠినముగ, పలుక, ఆలకించి=విని, మఱియు, చారులవలన = వేగులవారిగుండా, ఆమాట, జగములోన = లోకులలో, కలుగన్ = పుట్టన్ అనఁగా పుట్టుట, తెలిసి=తెలిసికొని, రాత్రి, సీత, నిద్ర, పోవ, చెప్పక = (ఆమెకు) తెలియపఱుపక, వాల్మీకి, పర్ణశాలన్ = ఆశ్రమమునందు, (ఆమెను) పెట్టన్, పనిచెను.

తా. రాముఁడు రాత్రివేళ మాఱువేషముతో బయలుడేరి లోకులాడి కొను మాటలువినుచుపోవుచుండ నయోధ్యలోనొక్కరుఁడు భార్య సుమార్గము లేనిదై యుండుటచేత ఆమెతో "నీవు పరులపంచల నున్నదానవు. నిన్ను నేను స్వీకరింపను. మమతమై పొరుగువారియింట నుండిన భార్యను మఱల కొనుటకు నేను శ్రీరామచంద్రుఁడ ననుకొంటివా? అంతవెఱ్ఱిని కాను" అని పరుషోక్తులాడెను.అది విని చారులవలనఁగూడ లోకులిట్లైతన్ను గుఱించివాడు కొనుచున్నారని యెఱింగి శ్రీరాముఁడు సీతాదేవి నిద్రించుచుండ ఆమెకు ఎఱుకసేయకయె ఆమెను వాల్మీకియాశ్రమమున విడిపించెను.

వి. అం. ఇందు శ్రీరాముఁడు స్వయముగ మాఱువేషములతో జను లలోఁ గలిసి విమఁయుము లరయుట తానరసినవే యైననుగూఢవృత్తిని వినినవి కనినవి అన్నివేళలను స్పష్టములు కావుగాన తనచారులవృత్తాంతమువలనబల పడువఱకును వానినిగూడ విశ్వసింపకుండుట సూచితములు. రాజ్యము

సం దుత్తమాధికారి యగు రాజే స్వయముగ విషయములు తెలిసికొని తాఁదెలి సికొనిన విషయములనుగూడ ఇతర విధమగు సాక్ష్యము లేక సమ్యక్పరిపాలన మొనర్చిన నంతకంటెను పౌరులకు భాగ్య మున్నె?

వ. అంత సీతయు గర్భిణి గావునఁ గుశలవు లనియెడి కొడుకులం గనియె. వారికి వాల్మీకి జాతకర్మంబు లొనరించె. లక్ష్మణునకు నంగదుండును చంద్రకేతుండును, భరతునకుఁ దక్షుండును బుష్కలుండును, శత్రుఘ్నునకు సుబాహుండును శ్రుతసేనుండును సంభవించి రయ్యెడ. ౯౦

టీ. జాతకర్మంబులు = పుట్టినప్పుడు చేయుక్రియలు, ఒనరించె = చేసెను, సంభవించిరి = పుట్టిరి.

వి. అం. సీతయు అనుటలో వైపద్యమును భావమున నిలుపవలె నని కవియాశయము. వాల్మీకియాశ్రమమున వనవాసమునకు పంపఁబడునప్పటికే సీత గర్భిణి గాన అని యర్థము.

క. బంధురబలుఁ డగు భరతుఁడు
గంధర్వచయంబుఁ ద్రుంచి కనకాదుల స
ద్బంధుఁ డగునన్న కిచ్చెను
బంధువులును మాతృజనులుఁ బ్రజలుఁ మెచ్చన్. ౯౧

టీ. బంధుర బలుఁడగు = ఒప్పునట్టి బలముగల, భరతుఁడు, బంధువులు, మాతృజనులును = తల్లులును, ప్రజలును, మెచ్చన్ = మెచ్చునట్లు గంధర్వచయంబున్ = గంధర్వులసమూహమును, త్రుంచి = ఓడించి, కనకాదుల = బంగారు మొదలగువానిని, అనఁగా కొల్లగొనినవిత్తముల ననుట, సద్బంధుఁడగు = సజ్జనులకు చుట్టమగు, అన్నకు శ్రీరామున కనుట, ఇచ్చెను.



తా. భరతుఁడు గంధర్వుల గెలిచి అన్నయాజ్ఞను తీర్చి అతనిని సంతోషపఱచెను.

వి. అం. ఉత్తరరామాయణమున భరతుఁడు గంధర్వులపై కెత్తిపోవుట సీత యయోధ్యకు మఱలివచ్చినపిదప జరుగుచున్నది. గంధర్వరాజ్యము భరతునికుమారులకుఁ బట్టము గట్టఁబడుచున్నది.[1]

ఆ. మధువనంబులోన మధునందనుం డగు
లవణుఁ జంపి భుజబలంబు మెఱసి
మధుపురంబు సేసె మధుభాషి శత్రుఘ్నుఁ
డన్న రామచంద్రుఁ డౌననఁగ. ౯౨

టీ. అన్న, రామచంద్రుఁడు, ఔననంగ = మెచ్చఁగ, మధుభాషి = ఇంపగుఉక్తులవాఁడగు శత్రుఘ్నుఁడు, మధువనంబులోన, మధునందనుండగు = మధుండనువానికుమారుఁడగు, లవణు = లవణాసురుని, చంపి, భుజబలంబు మెఱసి = బాహువులబలముచేత ప్రకాశించి, మధుపురంబు, చేసె = నిర్మించెను.

తా. శత్రుఘ్నుఁడు లవణాసురుని జంపి అన్నకు సంతోషము కలుగఁ జేసెను. మధుపురమును క్రొత్తగ నిర్మించెనో యన వృద్ధిపఱచెను.

కథ. మధువనమున మధుం డను రాక్షసుఁ డుండువాఁడు. అతఁడు మిక్కిలి గుణవంతుఁడు. దేవతలాదిగ ఎల్లవారును అతనిసౌహార్దయమును పొగడు చుందురు. అట్టియాతఁడు పుత్రసంప్రాప్తికై శివునిగుఱించి తపము

---

1. ఇక్కడి కథయందలి విభేదము సంస్కృత భాగవతకారునిదే.

చేసెను. శివుఁడును ప్రత్యక్షమై వర్ణం బొసఁగి వరముతోడన ఒకత్రిశూలము నిచ్చి "దీనిని ధర్మపరుండవై ఉపయోగించుకొనుము. నీకుఁ బుట్టుకుమారుఁడు బలిమిచే నజేయుఁడు కాఁగలవాఁ డని" ప్రసాదించెను. మధుండు చల్లగ రాజ్యమేలి లవణాసురుని గని వానికి రాజ్యమునిచ్చి పరలోకమున కేగెను. కాని లవణాసురుఁడు దుర్మార్గుండును బలశాలియు వరజనిత గర్వోన్నతుఁడును నయి అందఱను పీడింపఁజొచ్చెను. చ్యవనాదిమును లీతనిచర్యలను గుఱించి మొఱలిడుచు శ్రీరామునికడకు నేతెంచి యెట్లయిన నాదుర్మార్గుని బరిమార్పునది అని వేఁడిరి రాముఁడంత భరతశత్రుఘ్నులం జూచి మీలో నెవ్వం డీకార్యముం దీర్చునని ప్రశ్నించె. భరతుఁడు అన్నకు నమస్కరించి తా పోయి నెరవేర్చెదననియె. అంతట శత్రుఘ్నుండు "రామా! నాయన్న ఈభరతుండు నీవిటలేని పదునాలుగు సంవత్సరములును నందిగ్రామమునందు నివసించి కూరలాహారముగ నారలు వస్త్రములుగ నీకొరకై వ్రత మూని యుండినవాఁడు. అతని నిప్పుడు ని న్నెడఁబాయఁజేయ నామన సొప్పకున్నది. నేనే పోయి మీయాజ్ఞను దీర్చెదను. నాకు సెలవొసంగవలయును." అని వేఁడెను. రాముఁడద్దానికి సంతసించి శత్రుఘ్ను నయవచనంబులకు మెచ్చి అతనితో "నీవే పొమ్ము. శత్రుని గెలువుము. ఆరాజ్యంబు నీవే ఏలికొనుము." అనియె. అంత శత్రుఘ్నుఁడు అన్నలుండఁ దాను రాజ్యభారము వహించుట తగదని యెంచి ఆతలపోతను అఱఁజెప్పి యన్నయాజ్ఞ యగుట తలంచి మిన్నకుండె. శ్రీరాముఁడదంతయుంగాంచి చిఱునగవంకురింప భరతలక్ష్మణులచేఁ బట్టాభిషేకవస్తువులఁ దెప్పించి శత్రుఘ్నునకు లవణాసురపురపట్టంబు గట్టి వానిని వధించు నుపాయంబు సెప్పి దివ్యాస్త్రంబుల నిచ్చి పనిచె. శత్రుఘ్నుండును బలు పోరి లవణుంజంపి తద్రాజ్యంబు నేలుకొనియె. అంతకుమున్ను అనామధేయం బయియుండిన ఆమధుపురము శత్రుఘ్నుని పరిశ్రమవలన మహానగరమై వెలసెను.



వి. అం. ఈకథను జదివినపిదప చదువరులు 'మధునందనుఁడగు లవణు', 'భుజబలంబు మెఱసి' 'మధుపురంబు సేసె' 'మధుభాషి శత్రుఘ్నుఁడు' 'పొనరంగ' అను ప్రయోగముల సారస్యమును గ్రహించుట సులభము. ఇంతకథ మనస్సునఁ బెట్టుకొని పోతనామాత్యుఁ డీపద్యము వ్రాసెను. కాని చదువరులకు ఒక్కపట్టున నింత స్ఫురించుట కష్టము.

వ. అంతఁ గొంతకాలంబునకు రామచంద్రునికొమారు లయిన కుశలవు లిద్దఱును వాల్మీకివలన వేదాది విద్యలయందు నేర్పరులై పెక్కుసభల సతానంబుగా[1] రామకథాశ్లోకంబులు పాడుచు నొక్కనాఁడు రాఘవేంద్రుని యజ్ఞశాలకుం జని.

టీ. సతానంబుగా = స్వరయుక్తముగా, రామకథాశ్లోకంబులు = రామునిచరిత్రను దెలుపుపద్యములు.

కథ. 'అంత సీతయు గర్భిణి గావున' అనువచనమునుబట్టియు ఈవచనమును బట్టియు, సీత వనవాసమున కనుపఁబడినప్పుడు గర్భిణి యనియు వాల్మీకి యామెను సాకుచుండెననియు నట నామె కుశలవులను కనెననియు వాల్మీకి వారికి జాతకర్మాది క్రియలొనరించి వేదాదివిద్యలను రామకథను నేర్పెననియు వారు కుశాగ్రబుద్ధులై విద్యయం దుత్తీర్ణులై రామకథలు పాడుటయందు పేమగాంచిరనియు రాముఁడు అశ్వమేధ యజ్ఞదీక్ష వహించెననియు ఆయజ్ఞమునకు వాల్మీకి వెంబడి కుశలవులు వచ్చిరనియు ఇంతవఱకుంగల కథ స్పష్టమగుచున్నది.

---

౧. సతానకంబుగా నని పా. అం.

మత్తకోకిల.

వట్ట్రిమ్రాఁకులు పల్లవింపగ
వారి నైయె మధుధార దా
నుట్టఁ బాడిన వారిపాటకు
నుర్వరాధిపుఁడుం బ్రజల్
బిట్టు సంతసమంది రయ్యెడఁ
బ్రీతిఁగన్నుల బాష్పముల్
దొట్ట సౌదల లూఁచి వారల
తోడి మక్కువ పుట్టఁగాన్. ౯౮

టీ. వట్ట్రిమ్రాఁకులు = ఎండిపోయినచెట్లు, పల్లవింపఁగ = చిగుర్చుచు
నట్లు, అవారియై = అడ్డులేక అనఁగా పుష్కలముగ, తాను, మధుధార =
తేనెవర్షము, ఉట్టన్ = కురియఁగా మిక్కిలి మధురముగా ననుట (తేనె
లొలుకునట్లు పలుకుట యనువాడుకను స్మరించునది), పాడినన్, వారి (కుశ
లవుల) పాటకు, ప్రీతిన్ = ఇష్టాపూర్తిచేత, కన్నులన్, బాష్పముల్ =
సంతోషధారలు, తొట్టన్ = స్రవింపఁగా, సౌదలలు = శిరములు, ఊఁచి =
ఆడించి, వారలతోడిమక్కువ = కుశలవులయెడ అనురాగము, పుట్టఁగా =
పుట్టుచుండఁగా, ఉర్వరాధిపుఁడున్ = భూమికిరేఁడును అనఁగా రాముఁ
డును, ప్రజల్ = జనులును, బిట్టు = ఎక్కువగా, సంతసమందిరి = సంతో
షించిరి,

తా. కుశలవుల అసామాన్య సువ్యక్త మధురగానమును విని శ్రీరాముఁ
డును ప్రజలును మిక్కిలి ఆనందమందిరి. ఆబాలురయెడ వీరి కనురాగము
గలిగెను.



వ. అంత నారామచంద్రుండు కుమారుల కిట్లనియె. ౯౯

టీ. సుగమము.

ఆ. చిన్నియన్నలార శీతాంశుముఖులార
నళినదళవిశాల నయనులార
మధురభాషులార మహిమీఁద నెవ్వరు
దల్లిదండ్రి మీకుఁ దండ్రులార.[1]

టీ. చిన్నిఅన్నలారా, శీతాంశుముఖులారా = చంద్రునివంటిమోములు
కలవార! నళినదళ = తామరరేకులవలె, విశాల = వెడలుపగు, నయనులార =
కన్నులుగలవారా! మధురభాషులార = శ్రావ్యమైన కంఠముగలవారా!
తండ్రులార, మహిమీఁద = భూమిమీఁద, మీకు తల్లి, తండ్రి, ఎవరు;

తా. చిన్నికుమారులారా! మీతల్లిదండ్రు లెవరు?

వ. అనిన వార లేము వాల్మీకి పౌత్రులము[2] రాఘవేశ్వరుని
యాగంబు సూడవచ్చితి మనవుడు మెల్లననగి యెల్లిప్రొద్దున
మీతండ్రి నెఱింగెద రుండుం డని యొక్క నివాసంబునకు

1. ధన్యులార యని సాధారణపాఠము. రాఁబోవు వచనమును బట్టి
శ్రీరామునకు నీకుమారులు తనపుత్రులని నమ్మకము పొడమినట్లు గాన్పించు
చున్నది. కావున నిట ఎవరినో పరులనన్నట్లు 'ధన్యులారా' యనుటకంటె
గారాబున చిన్నియన్నలార మున్నగు సంబోధనములవలె నిదియు తండ్రు
లార యని యుండుటయె ఎక్కుడు ఉచితము.

2. శిష్యులమని పా. అం.

సత్కరించి పనిచె. మఱునాఁడు సీతం దోడ్కొని కుశలవుల
ముందట నిడుకొని వాల్మీకి వచ్చి రఘుపుంగవునిం గని
యనేకప్రకారంబుల వినుతించి యిట్లనియె. ౯౭

టీ. ఏము = మేము, పౌత్రులము = మనుమలము, ఎల్లిప్రొద్దున = రేపుప్రొద్దున, సత్కరించి=సన్మానించి, వినుతించి=స్తోత్రముచేసి.

వి: అం. ఉత్తరరామాయణకథ ననుసరించి వాల్మీకి రామునియశ్వమేధమును జూడ శిష్య బృందముతో వచ్చుచున్నాఁడు. శ్రీరాముఁ డతనికి విడిది యేర్పరచి గౌరవించుచున్నాఁడు. అటనుండి రెండవదినము మౌని యాజ్ఞం గొని కుశలవులు రామకథను బాడుటకు యజ్ఞశాలకుఁ జనియెదరు. వారు పోవునప్పుడు వారితో వాల్మీకి.

"......................రెవ్వారు మీరంచుఁ గే
వలమైత్రిన్ రఘుభర్త మిమ్మడిగినన్ వాల్మీకిమౌనీంద్రు శిష్యుల

మంచున్ వచియింపుఁ డవ్విభుఁ దలంపుం డాత్మలోఁ దండ్రిగన్"

అని చెప్పిపంపుచున్నాఁడు. ఈయుపదేశము పూర్తిగ వినియోగపడునట్లు ఉత్తరరామాయణకర్త కథను నిర్వహించి యుండలేదు. ఒక్కచోట శ్రీరాముఁడు కుశలవులు పాడినవిషయమునుగుఱించి యడుగుటయు కుశలవు లది వాల్మీకివిరచితమనియు అతనిదయవలనఁ దా మవి నేర్చిరనియు వర్ణితము. పిదప శ్రీరాముఁడు కుశలవులతనూవిలాసములు గనుఁగొని వారియాకృతులయందు సీతాదేవి యాకృతి నిరూపించుకొని సీత కవలను గనియె ననువార్త జ్ఞాపకమునకు రా వీరే కుమారులనుకొనుచున్నాఁడు. తక్కుంగలకథనడుచుచున్నది.



ఇఁక పోతనామాత్యుని కథ. 'పట్టిప్రాఁకులు పల్లవింప' అనుపద్యములోని కడపటి 'వారలతోడి (అనఁగా కుశలవులతోడి) మక్కువపుట్టఁగాన్' అను పదములచే రామునియం దనురాగాంకురము పొడముట సూచితము. 'చిన్నియన్నలార' మొదలగు పద్య మంతటిచేతను అందు ముఖ్యముగా'... ఎవ్వరు, తల్లిదండ్రి మీకుఁ దండ్రులార' యనుటచేతను సీతాదేవి కవలుపుట్టిరనువార్త వినుట శ్రీరామునికి చక్కఁగ జ్ఞాపకమునకు వచ్చుటయు తన్మూలమున నతనికిఁ గుశలవులయెడ ప్రేమగాఢమగుటయు విశదముగఁ బ్రదర్శితము. తరువాత ఈవచనమున కుశలవులు తల్లిదండ్రులను జెప్పక వాల్మీకి పౌత్రులమని చిన్నియన్నలకు సాజముగు తెలుంగున నుడువుటయు శ్రీరాముని చిఱునగవును,ఎల్లిప్రొద్దున మీతండ్రి నెతింగెద రుండుండను వాక్యమును మఱునాఁడు వాల్మీకి సీతను కుశలవులను తోడుకొనివచ్చుటయు హృదయానంద కరముగ నారంగమును మనకుఁ బొడగొట్టఁజేయుచున్నది.

ఆ. సీత సుద్దరాలు [1] చిత్తవాక్కర్మంబు
లందు సత్యమూర్తి యమలచరిత,
పుణ్య సాధ్వి విషువఁ బోలదు, చేకొను
రవికులాబ్ధిచంద్ర రామచంద్ర! ౯౮

టీ. రవికులాబ్ధిచంద్ర=సూర్యవంశ మను సముద్రమునకు చంద్రుఁడైన, రామచంద్ర = ఓరామచంద్ర! సీత, చిత్తవాక్కర్మంబులందు = తలఁపునందును మాటలయందును, చేతలయందును, సుద్దరాలు=పాప మెఱుఁగనిది, సత్య

1. శుద్ధురాలు అని పా.అం. కర్మధారయంబునం దత్సమంబులకుఆలు శబ్దంబు పరంబగునపుడు రుగాగమంబు అగునను సూత్రమాధారము చేసికొని ఇట 'శుద్ధ' శబ్దము తత్సమ మనవలసివచ్చును. అనినను అననగును.

మూర్తి=నిజముయొక్క స్వరూపము అనఁగా అనృతమాడనిది, అమలచరిత= కళంకములేని నడవడికలది, (ఇట్టి) పుణ్యసాధ్విన్= గుణవంతురాలగు ఇల్లాలిని, విడువన్ పోలదు = విడువరాదు, చేకొనుము = స్వీకరింపుము.

తా. ఈసీతాదేవి మనోవాక్కాయముల మూటను పరమపావని. ఈమె సుగుణపూరిత. ఈమెను విడువ తగదు. కావున ఓరామా ఈమెను స్వీకరింపుము.

వ్యా. సుద్దరాలు. సుద్ద + ఆలు. పేదాదిశబ్దంబులకు ఆలుశబ్దంబు పరంబగునపుడు కర్మధారయంబునందు రుగాగమంబగు అనుసూత్రముచే సుద్ద + ర్ + ఆలు = సుద్దరాలు అయినది, సుద్దము అనుపదము శుద్ధమునకు వికృతి.

వ. అని వాల్మీకి పలుక రామచంద్రుఁడు పుత్రార్థి యై విచారింపఁ గుశలవులను వాల్మీకికి నొప్పగించి రామచంద్ర చరణ ధ్యానంబు సేయుచు నిరాశ యై సీత భూవివరంబు సొచ్చె నయ్యెడ. ౯౯

టీ. అని, వాల్మీకి, పలుకన్, రామచంద్రుడు, పుత్రార్థియై=పుత్రులను కోరినవాఁడై, విచారింప = (ధర్మసూక్ష్మ) విచారముచేయఁగా, సీత, కుశలవులను, వాల్మీకికిన్, ఒప్పగించి, రామచంద్రచరణధ్యానంబు సేయుచు = శ్రీరాముని పాదములను మనసున నిల్పి, నిరాశయై = కోరికలను వదలినదై, భూవివరంబు = భూగర్భమును, చొచ్చెను, అయ్యెడన్=అప్పుడు.

కథ. శ్రీరాముఁడు తనభార్య పవిత్రతను ఎఱిఁగినవాఁడయ్యును జనాపవాదము పోఁగొట్టుకొనుటకు గాను మఱల నామెను శపథముచేయు మనియెననియు అందుచే నామెకు విరక్తిగలిగి రామధ్యానముచేయుచుఁ దనతల్లియగు



భూదేవి ప్రత్యక్షమగునట్లు చేసికొని రసాతలమునకు ఆమెతోడం గూడ భూగర్భముచొచ్చిపోయెననియు ఉత్తరరామాయణకథ. సంస్కృతభాగవతమున సీత వాల్మీకియాశ్రమమునందే భూవివరము చొచ్చెనని వర్ణింపఁబడినది. పోతనామాత్యుఁడు మహాభక్తుఁడగుట కాఁబోలు ఇట కథను సంక్షేపముచేసి సూచనమాత్రముచేత విషయము ముగించియున్నాఁడు.

మ. ముదితా యేటికిఁ గ్రుంకితీవు మనలో
మోహంబు చింతింపవే
వదనాంభోజము సూపవే మృదువు నీ
వాక్యంబు విన్పింపవే
తుదిసేయం దగదంచు నీశ్వరుఁడు నై
దుఃఖించె భూపాలుఁ డా
పద గాదే ప్రియురాలిఁ బాసినయెడన్
భావింప నెవ్వారికిన్. ౧౦౦

టీ. భూపాలుఁడు రాజు రాముఁడు, ఈశ్వరుఁడును = దేవుఁడును, అయి = అయ్యును, ముదితా = ప్రియురాలా, ఏటికి = ఏల, ఈవు = నీవు, క్రుంకితి = అస్తమించితివి, మనలో అనఁగా మనయందు పరస్పరముగల మోహంబున్ = వలపు, చింతింపవే = తలంచుకొనవా (తలంచుకొనుమా అనుట). వదనాంభోజము = ముఖకమలము, చూపవే = కనుబఱపవా (చూపుమా అనుట), మృదువు నీవాక్యంబు = సరళమగునీమాటలను, విన్పింపవే అనఁగా విన్పింపుమా యనుట, తుది= అంతము, చేయన్, తగదు అనఁగా మన సంబంధమును త్రెంపరాదు, అంచు = అనుచు, దుఃఖించెన్, భావింపన్ = యోజిం

చిచూడఁగా, ప్రియురాలిన్ = భార్యను, పాసినయెడన్ = పోఁగొట్టుకొని నప్పుడు, ఎవ్వారికిన్ = ఎవ్వరికిని, ఆపద = విపత్తు, కాదే (అగుననుట).

తా. శ్రీరాముఁడు దేవతావతారమే యయ్యును మానవాకృతినుండుటచేత తదుచిత ధర్మబద్ధుఁడై భార్యావియోగదుఃఖమునకుఁ బాత్రుఁడై విలపించెను.

వ్యా. మృదువు నీవాక్యంబు విన్పింపవే యను ప్రయోగమును గమనించునది. నీవాక్యముమృదువు (దానిని) విన్పింపుము అని అన్వయము.

వ. అని వగచి రామచంద్రుండు బ్రహ్మచర్యంబు ధరియించి
పదునొకండువేల యేండ్లెడ తెగకుండ నగ్ని హోత్రంబులు
సెల్లించి తా నీశ్వరుండు గావునఁ దన మొదలి నెలవునకుం
జనియె నివ్విధంబున. ౧౦౧

టీ. అని, వగచి = దుఃఖించి, రామచంద్రుండు, బ్రహ్మచర్యంబు, (రాముఁ డేకపత్నీవ్రతుఁడు గదా!) ధరియించి=వహించి, పదునొకండు వేల యేండ్లు, ఎడతెగకుండ = విడువక, అగ్నిహోత్రంబులు, చెల్లించి = సాగించి, తాను, ఈశ్వరుండు = దేవుఁడు, కావున, తన, మొదలి నెలవునకు = మొదటి స్థానమునకు అనఁగా పరమాత్మలోనికి, చనియె = పోయెను, ఇవ్విధంబున = ఈవిధముగా.

ఆ. ఆదిదేవుఁ డైన యారామచంద్రుని
కబ్ధిఁ గట్టు టెంత యసురకోటిఁ
జంపు టెంత గపుల సాహాయ్య మది యెంత
సురలకొఱకుఁ గ్రీడ సూపెఁగాక. ౧౦౨



టీ. ఆదిదేవుఁడు = మొదటిస్వామి, అయిన, ఆ, రామచంద్రునికి అబ్ధి = సముద్రమును, కట్టుట, ఎంత (విశేషముగాదనుట), అసురకోటి = రాక్షససమూహమును, చంపుట, ఎంత (విశేషముగాదనుట), కపుల= వానరుల, సాహాయ్యము, అది + ఎంత = అది ఏమాత్రము (అదియు విశేషము గాదు) సురలకొఱకు=దేవతల పరముగ, క్రీడ = లీల, చూపెన్ = కాక.

తా. దైవంబగు శ్రీరామునకు సముద్రము గట్టుటగాని రాక్షసులను జంపుటగాని విశేష కార్యములు గావు. వానరులసాహాయ్యము గొప్పసాయము గాదు. కాని దేవతలను సంరక్షింప నవతరించి ఆతఁడు ఇవి యన్నింటిని తన జీవితమునఁ గనుపఱచెను.

చ. వశుఁడుగ మ్రొక్కెదన్ లవణ
వార్ధివిజృంభణతా నివర్తికిన్
దశదిగధీశ మౌళిమణి
దర్పణమండిత దివ్యకీర్తికిన్
దశశతభానుమూర్తికి సు
ధారుచిభాషికి సాధుపోషికిన్
దశరథరాజుపట్టికిని
దైత్యపతిం బొరిగొన్న జెట్టికిన్. ౧౦౩

టీ. లవణవార్ధి=ఉప్పుసముద్రముయొక్క, విజృంభణతా = ఉప్పొంగుటను, నివర్తికిన్=పోఁగొట్టినవానికి, దశదిక్ =పదిదిక్కులయొక్క, అధీశ=అధిపతులయొక్క, మౌళి=శిరములందలి, మణి=మణులనెడి, దర్పణ= అద్దముల చేత, మండిత = అలంకరింపఁబడిన, దివ్య=శుభ్రమైన, కీర్తికిన్ =

కీర్తిగలవానికి, దశశత = పదినూరులు అనఁగా వేయి, భాను=సూర్యుల వంటి, మూర్తికిన్ = స్వరూపముగలవానికి, సుధా = అమృతముయొక్క రుచి=రుచిగల, భాషికిన్ =మాటలుగలవానికి, సాధుపోషికిన్ = మంచి వారిని రక్షించువానికి, దైత్యపతిన్ = రాక్షసులరాజును రావణుని, పోరి గొన్న =చంపిన, జెట్టికిన్ = మల్లునకు, దశరథరాజు పట్టికిన్ = దశరథునికుమారుఁడైనవానికి శ్రీరామునికి, వశుఁడుగ=విధేయుఁడుగ, మ్రొక్కెదన్ =నమస్కరించెదను.

తా. సముద్రపుగర్వము నడఁచినవాఁడును మహాకీర్తిమంతుఁడును మహాతేజస్వియు మృదుమధురవాక్కలితుఁడును సజ్జనపోషకుండును దుష్టరావణసంహారకుఁడును దశరథసూనుఁడును అగు శ్రీరామునకు నమస్కరించెను.

ఉ. నల్లనివాఁడు పద్మనయ
నంబులవాఁడు మహాశుగంబులున్
విల్లును దాల్చువాఁడు గడు
విప్పగువక్షమువాఁడు మేలు పైఁ
జల్లెడువాఁడు నిక్కిన భు
జంబులవాఁడు యశంబు దిక్కులన్
జల్లెడువాఁడు నైన రఘు
సత్తముఁ డిచ్చుత మాకభీష్టముల్. ౧౦౪

టీ. నల్లనివాఁడును, పద్మనయనంబుల వాఁడున్=కమలములవంటి కన్నులుగలవాఁడును, మహా + ఆశుగంబులున్=గొప్పబాణములును, విల్లును, తాల్చువాఁడు = ధరించువాఁడును, కడు = మిక్కిలి, విప్పగు = వెడల్పుగల, వక్షమువాఁడున్ = ఎదగలవాఁడును, మేలు, పైన్ = లోకముపైన అనుట, చల్లెడువాఁడున్ = వ్యాపింపఁజేయువాఁడును, నిక్కినభుజంబులవాఁడున్ = ఉన్నతములైన భుజములు కలవాఁడును, యశంబున్ = కీర్తిని, దిక్కులన్ = (అన్ని) దిశలయందును, చల్లువాఁడును = వ్యాపింపఁ జేయువాఁడును, అగు, రఘుసత్తముఁడు = రఘువంశమున శ్రేష్ఠుఁడు శ్రీరాముఁడు, మాకు, అభీష్టముల్ = కోరికలను, ఇచ్చుత = ప్రసాదించుఁగాక.

తా. నల్లనివాఁడును కమలాక్షుఁడును మహాధనుర్ధారియు మహాబలశాలియు యశోవంతుఁడును లోకోపకారియు నగు శ్రీరాముఁడు మాకోరికలను ఫలింపఁజేయును గాక !

ఆ. రామచంద్రుఁ గూడి రాకలఁ బోకలఁ
గదిసి తిరుగువారుఁ గన్నవారు
నంటికొన్నవారు నాకోసలప్రజ
లరిగి రాదియోగు లరుగుగతికి. ౧౦౫

టీ. రామచంద్రున్, కూడి, రాకలన్ పోకలన్=ప్రయాణములయందు, కదిసి = సమీపవర్తులై, తిరుగువారున్ = తిరుగువారును, కన్నవారున్ = (అతనిని) చూచినవారును, అంటికొన్నవారును = (అతనిని) తాకినవారును, (అయిన,) ఆ, కోసలప్రజలు = కోసలదేశపుజనులు, ఆదియోగులు = మొదటియోగు లైనసనకాదులు, అరుగు = (చేర) పోవు, గతికి=పదవికి ముక్తికి అనుట, అరిగిరి = పోయిరి.

తా. శ్రీరామచంద్రునితోఁ గూడ కోసలదేశమున జీవయాత్ర నడపిన వారెల్లను, అతనితో సంబంధములు గలవా రగుటవలనను అతనిని చూచుటవలనను సద్గతిని చెందిరి.

క. మంతనములు సద్గతులకుఁ
బొంతనములు ఘనము లైన పుణ్యముల కిదా
నీంతనపూర్వమహాఘని
కృంతనములు రామనామకృతి చింతనముల్. ౧౦౬

టీ. రామనామకృతి చింతనముల్ = శ్రీరాముని పేరుగల కావ్యము యొక్క మననములు అనఁగా రామాయణ పఠనము, సద్గతులకు = మంచిపదవులకు (మంచినడవడికకనియుఁ జెప్పవచ్చును), మంతనములు=రహస్యస్థానములు, ఘనములైన = గొప్పలైన, పుణ్యములకు (శ్రేయస్సనకనియు నర్థముధ్వని) పొంతనములు = మిత్రములు, ఇదానీంతన = ఇప్పటివియు, పూర్వ = గడచినవియు, (అగు), మహా=గొప్ప, అఘ=పాపములకు, నికృంతనములు = ఖండనములు.

తా. రామాయణ పఠనమువలన సన్మార్గములును ముక్తియు అబ్బును. శ్రేయస్సును పుణ్యమును చేకూరును. ఇప్పటివి గడచినవియు నగు దోషములును పాపములును నశించును.

వి. అం. కడపటి యైదుపద్యములును కృత్యంతములు. కథకు సంబంధింపని కవియొక్క సొంతవాక్యములు. శ్రీరామునకుఁ బరమభక్తుండగు పోతనామాత్యుఁ డిందు ప్రార్థనాదుల నొనర్చి శ్రీరామచరిత్రమును ముగించియున్నాఁడు. చదువరులు శ్రీరామునియొక్కయు సీతాదేవియొక్కయు సుగుణసంపత్తికిఁ దాము సంపాదింపఁగడంగి శ్రేయస్సనందుదురు గాత!

సంపూర్ణము.



Vedam and Co. Printers, Madras.

